ఆ॥ జగతి జీవులెల్ల ♦ జాలినొందఁగ ఖేచ, రులును మానులును క ♦ రుణ వహింప
రాలుఁ గరఁగ నేడ్చి ♦ రావణు పైఁబడి, పలవరించె నిట్లు ♦ బహు విధముల. ౧౩౯౪

సీ॥ హా లోకభీకర ! హా మేరునిభ ధీర ! అద్వంద్వ శూర ! మా ♦ యా ప్రకార !
ఉండుచోఁ ద్రిదశ కు ♦ లోన్మాలి వైతివి, చచ్చుచో నసుర వం ♦ శముఁ జెఱిచితి
మ్రింగిన గరళంబు ♦ మేకొని చెఱచు జా, నకి యను విసము కా ♦ నఁగనె చంపు
వలదని యానాఁడె ♦ పలుకంగ వినవైతి, విఁక నేఁటికి వినంగ ♦ నిచ్చగింతె ?

తే॥ పర కళత్రంబుఁగొంట య ♦ భావ్యమంటిఁ, దాలఁగరాని యపఖ్యాతి ♦ దారయునంటిఁ
గోరవలదంటి వైరంబు ♦ కూడదంటి, వంశము నశించునంటి నా ♦ పలుకువింటె ?

శా॥ నాఁడగ్నిం బడినట్టి వేదవతి యీ ♦ నాఁ డుర్వరా జాతయై
యీడంబోవక దైత్యనాశమునకై ♦ యిచ్చోటికిం జేరె నీ
జాడ ల్వలదని యెంతచెప్పినను రో ♦ షస్ఫూర్తి మన్నింప క
క్క్రీడాగోడము చేసికొంటి కుల శా ♦ ర్యైహ్య విభూత్యున్నతుల్. ౧౩౯౬

ఉ॥ కారుణికుండు రాముఁడని ♦ కామిని నిమ్మని సంధిమేలనం
గా రహిఁ బీడకుంటి వర ♦ గౌరవముల్ పది శీర్షముల్ వృథా
ధారణిఁ బొర్లుచున్నయవి ♦ తప్పక నాపలుకిప్పుడైన నీ
తా రమణుం డనాది పర ♦ తత్త్వము చుమ్మని నమ్మితే దివిన్. ౧౩౯౭

శా॥ వీరస్వర్గము చేరితో ? నలువ మే ♦ ల్పీఠం ప్రవేశించితో ?
తారాద్రిం దగఁ జొచ్చితో ? యెవఁడు నిన్ ♦ దాకొంచు నీజీవ సం
చారంబుం గొనిపోయె ? కాలుఁడో ? లస ♦ చ్చంద్రాంశువుల్ నేఁడు చ
ల్లారం గల్గెనె ? మారనాటకము నేఁ ♦ డైనం దుదిం బొందెనే ? ౧౩౯౮

చ॥ మగనిని చంపుచేఁత తన ♦ మానసమందిడి చుప్పనాక యీ
పగ గొనితెచ్చి యిచ్చి తన ♦ పంతము నెగ్గఁగఁ జేసికొన్న దీ
పగిదిగ నారకానఁ గల ♦ పాపులు స్వస్సుఖమొందు పుణ్యులున్
బగఱుగ నైరి యెల్లిదపుఁ ♦ బాటున నేరి మొగంబు గాంతువో ?

మహాస్రగ్ధర.

విజయశ్రీ పంకజాక్షిన్ ♦ విమలగుణయుతన్ ♦ విశ్వ సాహిత్య లక్ష్మిన్
భుజమేధా శక్తి యుక్తిన్ ♦ భువన విజయ వి ♦ స్ఫూర్తి నాసించు చేతుల్
త్రిజగన్మాతన్ బ్రపూతన్ ♦ త్రిదశగణనుతన్ ♦ బృథ్వి సంజాత సీతన్
బొజుఁగై స్పర్శించు నిచ్చన్ ♦ భువినె తడవఁగాఁ ♦ బూర్ణ సంసిద్ధి గంటే ! ౧౪౦౦

తే॥ అనుచుఁ బనవు విభీషణు ♦ ననలికీడ్చి, విధి నెఱింగియు మతిచెడ ♦ వెగవనేల ?
లెమ్ము కాఁగల పనుల నా ♦ లింపు మనుచు, భల్లుకేశుండు లేపి సాం ♦ త్వనముపలికె.

## —: మండోదరి విలాపము :—

మ॥ విరియం బాఱిన కేశపాశములతో ♦ వ్రేలాడు హారాలితో
సురుఁగం బాఱిన ఘూర్ణ చిత్తములతో ♦ జొబ్బిల్లు కన్నీటితోఁ
గరముల్ ద్రొమ్మున మోఁదికొంచు వడి లం ♦ కానాథు కాంతల్ వరా
మరిసల్ లేని విధంబునన్ జరగిరా ♦ మందోదరీ యుక్తలై. ౧౪౦౭

తే॥ పొలుచు సత్యంబు ధర్మంబు♦భూతదయయుఁ,గలుగుకులమునఁ బుట్టిన♦ఘనుఁడుసిగ్గు
వదలి చేయు కార్యమువలె♦వాయి విడిచి, యేడ్చు కాంతలరవ మెల్ల♦యెడలఁ బరవె.

తే॥ కాలియందెలు మొఱవెట్ట ♦ గజ్జెలేడ్వఁ, గొంద ఱేగుదెంచిరి రణ♦క్షోణి కపుడు
కొందఱు పురందరుని పగఁ♦గూలె ననుచు, నచటనే జీవముల వీడి♦రవని దొరలి

తే॥ ఘోర శోకంబు గందర♦గోళపఱుప, నందముం జెడఁ దొడవులు♦చిందుచుండఁ
గనుల న్రశుజాలము మబ్బు♦కరణిఁ గురియ, వసరి విన్నఁ్రోవఁ గొందఱు♦వచ్చినారు.

తే॥ తలలు మోఁదుకొనెడువారు♦తడవువారు, కనుల నీరూర నా దశ♦కంఠు బాహు
పీఠముల మీఁదఁబడి నూత్న♦విగత భర్తృ, శోకమున నేమి యెఱుఁగక♦స్రుక్కినారు.

తే॥ పదములును ద్రొమ్మ భుజములు♦వదనములును, తొడిఁబడఁగఁ బలుమాఱులు♦తడవి తడవి
యేడ్చియేడిచి నాలుక♦లెండఁబాఱ, తెలివి దప్పి ధారణిపయిఁ♦దెరలినారు.

ఉ॥ పొందరు మున్ను దుఃఖములఁ ♦ బొందిన నెప్పుడొ పొల్లయల్కయే
పొందుదు రద్దియుం దుదిని ♦ పూర్ణ సుఖప్రద మంచు నెమ్మదిం
గొందురు దైత్యకాంత లిటు ♦ గూరిన యార్తి భరింపలేక యా
డెందముపైని వ్రాలి రట♦డిందిన ప్రాణము రోయుకై వడిన్. ౧౪౦౮

తే॥ జక్కినులు రక్కసులు నాగ♦చంద్రముఖులు, సిద్ధ సఖులు విద్యాధర♦స్త్రీ లభేద
మోహాముంచుటచే శోక♦మున మునింగి, తడవి తనివి సనక చాలఁ ♦ దల్లడిలిరి.

తే॥ ధర్మము నశింప నెదఁ జేర్చు♦ధరణిజాత, మీఁది మరులున మమ్ముప్రే♦మింపవైతి
దానిచేఁగాదె యీగతి♦తనరెనీకు ? దాని వదలి మమ్మిప్పుడైనఁ♦దనుపరాదె ?

తే॥ అనుచు ద్రోల మండోదరి♦యలమటించి, కడలిపై మించు వ్రాలిన♦కరణి విభుని
వక్షమున వ్రాలి శిలలును♦వృక్షములును, కరఁగి తోడన పలవింపఁ♦గనికరించె,

చ॥ అసుర విభుండు తా మరణ ♦ మందిన పిమ్మట నేను నందుటల్
దొసఁ గతి దుర్భరం బమిత ♦ దుర్భర మక్కట! నాదు సన్నిధిన్
బొసఁగిన యివ్వి నీమకుట ♦ భూషిత శీర్షములే ? కదించి నా
వ్యసనము మాన్పవో ? వదన ♦ పద్మ వికాసము చూపవో యిఁకన్ ?

చ॥ ఎలరిచి వెండికొండ భరి ♦ యించిన నీ పెనుమేని లోపలన్
వెలుపల నూవుగింజ యెడ ♦ వీడక తోల్చి యసువ్రజంబు ని
ట్టలముగ రోయుతీరొ ? పద ♦ టంబున జానకిమీఁది ప్రేమ లో
పలఁ గలదంచు నారసిన ♦ పద్ధతియో ? యిది రామబాణముల్ !

చ॥ అలయక రాము తూపులు గు ♦ హాముఖముంబలె ఱొమ్ముఁదొల్చి య
వ్వలఁ జనియున్న వక్కట ! త ♦ పంబును దార్ఢ్యము వీర్యముం జెడన్
బొలిసితివే ? యిఁకేది గతి ? భూ♦రితరోగ్ర శరంబొకండు ని
మ్మళముగఁ గ్రోలె జీవముల ♦ మానుష శక్తియు నింత యొప్పునే ?

మ॥ వనితాజాతికి భూషణంబయిన యా ♦ వైదేహి యందంబు త
ద్ఘన పత్నీత్వము దైత్య నాసికయు లం ♦ కారాజు కామంబు రా
ముని కాంతార నివాస నిర్ణయ విధం ♦ బుం గూడి జంభారి చే
సిన పుణ్యంబుగఁ బూర్తియై పరిణమిం ♦ చె న్నాకు నేఁడీగతిన్.

చ॥ అమరుల దిగ్గజంబుల న ♦ మాపతి ధాత్రు ముకుంద జిష్ణులన్
సమరమునందు మించిన య ♦ సాధ్య బలాఢ్యున కెచ్చటన్ వినా
శము కలదే యటంచు నెల ♦ సంబున నుండితి నీ మహాతపః
క్రమ ఫల జీవితంబునకు ♦ రాముఁడు పుట్టెఁ గృతాంతుఁడై భువిన్.

చ॥ కొమరుగ నొందు మూఁడు నఱ ♦ కోటికి మేర వచింపరాని స
త్త్వమునకు జీవితానకుఁ ద ♦ పఃఫలరాశికి నింక నాశ మే
క్రమమున వచ్చునంచు మది ♦ గాఢ తరంబుగ నమ్మియుంటి సీ
తమ యను ఘోర హాలహాల ♦ మక్కట యన్నిటి మ్రింగె వ్రేల్మిడిన్ !

చ॥ జగము స్వభావ మిట్టిదని ♦ సత్య మెఱుంగు సమర్థు లెవ్వ రీ
జగముల నెల్ల గెల్చిన ప్ర ♦ శస్త బలిష్ఠులు నిల్చిరేమి ? యిం
చగు విలు తేటి నారి పువు ♦ టమ్ములు గల్గిన శంబరారికే
యగడుపడంగఁ జిక్కిన బ♦లాఢ్యుని నాశము చేయరే నరుల్ ! ౧౪౧౯

తే॥ రాము నెంచితి నాది నా♦రాయణునిగఁ, దెలియ కిట్టు లుత్తముని ప♦త్నిని చెఱగొని
వచ్చితివి తత్ఫలం బను♦భావ్యమయ్యె, నిప్పుడైన నియ్యది నీకు♦నెఱుఁగరాదొ ?

మ॥ అని చింతాకులితాత్ముఁడై పనవి య♦త్యంతంబు దుష్ప్రాప వే
దన నిండారఁగ శీర్ణ హారమగు త ♦ ద్వక్షంబు హస్తంబుతోఁ
దనియం జేరిచి తృప్తిమై నతని నా ♦ థా! యంచుఁ బేర్వాడి యం
తన నిశ్వాసము నిల్పె జీవములు నం ♦ తర్లీనమై పోవఁగన్. ౧౪౨౦

తే॥ అమరకాంతలు విద్యాధ♦రాంగనలును, మునిసతులు నాగ తరుణులు♦మనుజ సఖులు
పెక్కుగతుల మందోదరి♦పెద్దతనము, వేయి నోళ్ల శ్లాఘించి ర♦వ్వేళయందు.

సీ॥ అంత విభీషణుఁ♦డంతరంగంబునఁ, జింతించి క్రమరీతిఁ♦జచ్చుకొలిపి
సంస్కారముల నెల్ల♦శాస్త్రోక్తముగఁ జల్పి, శవముల నుంచెఁ గా♦ష్ఠములమీఁద
వాద్య స్వనము లెల్ల♦వారి రవంబుల, వినసీక మిక్కిలి♦విస్తరించె
సిడమును తెల్లని♦గొడుగును తోడరా, నతని పత్నులును వె♦న్నంటి నడవఁ
తే॥ జుట్టివచ్చి యిర్వురకుఁ జి♦చ్చును రగిల్చి, చేయఁదగు క్రియలెల్లను♦చేసి యవలఁ
దక్కువారికిఁ గూడ నా♦తండె యుక్త, కర్మము లొనర్చె బడి సుద♦కంబుతోడ.
ఆ॥ అవల వచ్చి రాము♦నంఘ్రి పద్మములకు, మ్రొక్క నతఁడు నతని♦పొసఁగు గాంచి
లోక సహజ మిద్ది♦నీకు నుమ్మలిక మి, ట్లొందు టుఱవె యనుచు♦నూఱడించె.

## 32 శ్రీరామ నివర్తన పటలము. (3౫ు)

తే॥ బహుళ శాస్త్ర మర్మంబులఁ♦బ్రకృతి నైజ, ధర్మముల నెఱిఁగించి యా♦దైత్యరాజు
నూఱడించి లక్ష్మణుఁ గసి♦రొప్పమీఱ, నిట్టులనియె రాముఁడు ప్రేమ♦మెనకొనఁగ.
ఆ॥ అర్కసుతుఁడు మారు♦తాత్మజుఁడును తక్క, కపివరులును వెంటఁ♦గదల నేగి
నీతియుతుఁడు యామి♦నీచర విభునకుఁ, బట్టమొనగ నీవు♦కట్టుమయ్య. ౧౪౨౫
క॥ అని యాజ్ఞచేసి పంపఁగ, ననిమిషులు దిగీశు లప్పు♦డగునంతకుఁ బ్రే
మను శక్తి కొలఁదిఁ దోడ్పడి, పనులొనరించిరి విశేష♦పరతంత్రులుగన్. ౧౪౨౬
ఆ॥ పుణ్య తీర్థములను♦మొగులు జలంబుల, జలధి జలము హార♦సమితి సింహ
పీఠి బొమిడికమ్ము♦ప్రీతితో వేల్పులు, తెచ్చి కొఱఁతలేక♦యిచ్చినారు. ౧౪౨౭
ఆ॥ అజుని యాజ్ఞవలన♦హరిణముఖుండు మ, యుండు వచ్చి హరిహ♦యుఁడు భవుండు
పొగడఁదగిన పగిదిఁ♦బూజ్య విధంబుల, మంటపంబు గూర్చె♦మండనముల.
తే॥ విధియుతంబుగా బ్రహ్మాది♦విబుధవరులు, పుణ్యతీర్థాభిషేకంబు♦పొసఁగఁ జేయ
నన్న యాజ్ఞానుసారి రా♦మానుజుండు, ప్రీతి మకుటంబు వెట్టె వి♦భీషణునకు.
ఉ॥ నీలగిరీంద్ర శృంగమున ♦ నీరజ మిత్రుఁడు తోఁచు చందమై
నీలమణీ విభాసిత వి ♦ నిర్మల పీఠి విభీషణుండు మో
దాలసుఁడై కిరీటయుతుఁ ♦ డై తగు బంధువులైన పూర్వ దే
వాలి భజింప వాసవుని ♦ యందమునన్ వెలుఁగొందె నత్తఱిన్. ౧౪౩౦
తే॥ సురలు కల్పక సుమములఁ♦గురిసినారు, తావి పూవుల సిద్ధ సా♦ధ్యావలులును
చిందఁజేయఁ ద్రిమూర్తులు♦శిష్టవరాని, జనము లాశీస్సుమంబులఁ♦జల్లినారు.
తే॥ నవ్యమకుట భూషణుఁడు దా♦నవవిభుండు, భక్తితోడను సౌమిత్రి♦పాదసరసి
జాతములకుఁ బ్రణామంబు♦నరవిఁజేసి, పలికె విశదఫణితి నెల్ల♦వారు వినఁగ.
తే॥ ఏను శ్రీరాము సన్నిధి♦కేగి మరలి, వచ్చునందాఁక నీలంకఁ♦బ్రాభవమునఁ
గొఱఁతలేక పాలింపంగఁ♦గోరినాఁడ, ననుచుఁ బ్రార్థించి యొప్పించి♦యచటి కరిగె.

తే॥ కపికులేంద్రునితోడ నం♦గదునితోడ, వచ్చి పదముల కెఱఁగిన♦వాని దైత్య
విభుని రామచంద్రుండు సం♦ప్రీతితోడ, నలమి మృదు భాషణంబుల♦నల్లననియె.

చ॥ పనిగొని మూఁడు లోకముల ♦ వారు నుతింపఁగ దేవతాలికిన్
జనులకు నీతిపద్ధతికిఁ ♦ జక్కటికిం దగురీతి నిల్చి శ్రీ
యును సుకృతంబు కీర్తియు న ♦ మున్నతి నొందఁగ రాజ్యభారమున్
గొని సుఖమందుమా యనుచుఁ ♦ గొన్ని హితోక్తులు పల్కి పిమ్మటన్.

—: హనుమంతుఁడు సీతకు రామ విజయము తెల్పుట :—

చ॥ హనుమనిఁ గాంచి నీవు జన ♦ కాత్మజ యున్న వనంబు చేరి యిం
దొనరిన యెల్ల సంగతుల ♦ నొప్పుగఁ దెల్పుమ యన్న నాతఁడున్
బనివిని వాయువేగమునఁ ♦ బావని జానకి యున్న చోటికిన్
జని వసి వాడియున్న విర ♦ జాజికి వర్షమువోలెఁ గన్పడెన్.

చ॥ కనఁబడి మ్రొక్కి భానుకుల ♦ కాంతుని నామము నుచ్చరించుచున్
దనియక గంతులేయుచును ♦ తాళము వైచుచుఁ బాటపాడుచున్
జనకజ తన్ను గాంచియె ని ♦ జంబు గనుంగొనఁ బెక్కురీతులన్
గునియుచు నెట్టకేని సుమ ♦ కోమలి పాదము డాసి యిట్లనున్. ౧౪౩౬

చ॥ శుభము శుభమ్ము మంగళము ♦ శోభన దేవతకున్ జయమ్ము మే
లుశుభములు తల్లికిన్ దనుజ ♦ సూదనజాయకు భద్రముల్ సుర
ప్రభృతులు సంతసింప రఘు ♦ రామ మదేభము యామినీచర
వ్యభిజన సారసాకరము ♦ నంకిలి వీడి కలంచెఁ దల్లిరో! ౧౪౩౭

ఉ॥ రావణ మత్త నాగమును ♦ రామ మృగేంద్రము చించిచెండె ర
క్షోవిభు మస్తకంబులు వ ♦ సుంధర దొర్లెను వాని బావురుల్
ప్రేవులు నక్కలీడ్చెను శ ♦ రీరముమీఁద నెఱంగె గ్రద్దలున్
గావరు కన్నులం బొడిచి ♦ కాకులు దిన్నవి సంగరస్థలిన్. ౧౪౩౮

క॥ తోషమతి రామునాజ్ఞ వి, భీషణు నియమమున లంక ♦ వీథుల సుర వి
ద్వేషుల కాంతలు దక్కఁగఁ, భాషింపఁగ నొక్క యసుర ♦ బ్రతుకండయ్యెన్.

క॥ అమృతము మించిన యావా, క్యములన్ విని యొక్క కళను ♦ గల రేక క్రమ
క్రమమున వర్ధిలి యంకము, సమసిన విధుఁబోలి జనక ♦ జాత వెలిఁగెన్

ఆ॥ రాహు గళితమైన ♦ రాజ బింబమువలె, ధరణిజాత ముఖము ♦ తనరఁ గాలుఁ
గేలు బొమ్మ మనము ♦ లీలఁ బూరించెను, మేరలేక ముదము♦మీఱుకతన.

ఆ॥ కార్శ్యమొందియున్న♦కాంతయంగములెల్లఁ, బెద్దవగుచుమిగులఁ♦బెరుగఁగఁజొచ్చె
వాడియున్న వల్లి♦వర్షంబుచేత నా, నా ముఖముల నెలసి ననుచు భంగి. ౧౪౪౩

చ॥ భ్రుకుటియు వంగఁ జెల్వముగ ♦ నోష్ఠము చెమర్పఁ దలం పొకండుగా
నొకటి వచించునట్టిదిగ ♦ నొప్ప సముత్కముచేతఁ బక్వమై
రకమగు ప్రేమ కల్లువలె ♦ భ్రాంతిని గొల్పునె? యేమివింత? జా
నకి కెది పల్కఁ దోఁచక మ♦నంబున నూరక యుండె నివ్విధిన్. ౧౪౪౪

ఉ॥ నీతియుతుండు సద్గుణి మ ♦ నీషి మరుత్సుతుఁ డద్ది కాంచి త
ల్లీ! తరమెంచరాని యెన ♦ లేని కుతూహలమొంది యుత్తరం
బీతని కేమి యిత్తునని ♦ యెంచఁగ లేకిటు లూరకుంటివో?
కోఁతి యసత్యమాడె నను ♦ కొంటివా? యన్న వచించు నామెయున్.

చ॥ అనదృశమైన యుత్కలిక ♦ యాదట యన్నియు రేఁగి నన్ను నా
వనమున నుండనీకిటులు ♦ పల్లటసేసెను పక్కణింప నే
దెనయును తోఁపనీయమిని ♦ తెప్పిఱకుంటిని నిబ్బరంపు సం
తస మది చిత్త విభ్రమము ♦ దార్కొనఁ జేయదె? మారుతాత్మజా!

ఉ॥ నీ వలనాఁడు నాచెఱను ♦ నీఁగెద నంచభయం బొసంగి యా
కైవడి మన్మనో నిలయుఁ ♦ గ్రచ్చఱఁదెచ్చి దురాన దైత్యులన్
వావిరిఁ గూల్చి తద్విజయ ♦ వార్తను తెల్పిన పుణ్యమూర్తి ని
న్నేవిధి సత్కరింతునని ♦ యేమియుఁ దోఁచకయుంటిఁ బావనీ! ౧౪౪౭

మ॥ ఇన వంశోత్తముఁ దోడితెచ్చితివి నా ♦ హీనస్థితిం దెల్పి మ
ద్ఘన దుఃఖంబులఁ బాపినాఁడవు త్రిలో ♦ కంబుల్ ప్రసాదించినన్
తనయా! యస్థిర లక్ష్ములవ్వి నత మ ♦ స్త ప్రాంజలుల్ దక్క నే
యనువుం దోఁచదు వాంఛయున్నను ప్రియం ♦ బారంగఁ దెల్పంగదే!

చ॥ అనవుడు వాయుజుండు హృద ♦ యంబున నుబ్బి నమస్కరించి మ
జ్జననివి నీముదంబె యగు ♦ జానగు నా యభివాంఛలెల్ల ని
న్మనుకులచంద్రు సన్నిధి స ♦ మర్పణసేయ మనంబుగోరు సే
వనమునకంటె మేలయిన ♦ భాగ్యము నాకొకటేని లేదికన్. ౧౪౪౯

మ॥ త్రిజగ త్సన్నుత జాతిరత్నము క్రియన్ ♦ దీపించు స్త్రీరత్నమున్
ద్రిజటం దక్కఁగ నిన్నలంచి బహుళా ♦ర్తిం గూర్చు నీరాక్షసీ
వ్రజము న్నా కసిదీఱ దంచుటకు సం ♦ రంభించె డెందంబు బే
రజము ల్వల్కిన వీరి నాలుకల వై ♦ రంబూడఁగా నూడ్చెదన్. ౧౪౫౦

చ॥ పలుకఁగరాని ప్రల్లదము ♦ పల్కుచుఁ బైఁబడి మ్రింగువార మం
చులుకఁగఁజేసి చీల్తుమని ♦ యుత్తలపెట్టుచు నొంచుచుండు నీ
పలువల జాతి చెల్వలను ♦ పాద నఖంబుల ఛిన్న భిన్నముల్
సలిపెద నీవరం బొసఁగు ♦ చాలు రహించెద నంచు వేఁడఁగన్. ౧౪౫౧

చ॥ చెలువలు భీతిమైఁ జెదరి ♦ సీతపదంబుల వ్రాలి తల్లి! నీ
యలఘుపదంబులే శరణ ♦ మంచు విధేయత వేడ నంజకల్
వలదని మాటయిచ్చి కపి ♦ వర్యుని గాంచి విశుద్ధ మానసా!
తలఁపకు వీరిఁ జంపుటకుఁ ♦ దప్పులు వీరలయందు గల్గనే? ౧౪౫౨

ఉ॥ రావణు బోధచే నటులు ♦ రాయిడి చేసిరి కాని వీరికిం
భావములందు నాయెడల ♦ వైరము గల్గద యస్వతంత్రలుం
నావిధి యిట్లు న న్నకరు ♦ ణంబుగ నేఁచుచు నుండెఁగాక యో
పావని! వీరు కుబ్జవలెఁ ♦ బాపులు గారు సహింపఁగాఁ దగుం. ౧౪౫౩

ఉ॥ పాప కులంబునం బొడమి ♦ పాపములం దలవాటుపడ్డ దు
ర్లేపులె మైన నావలని ♦ ప్రేమను వీరి మనంబులందు సం
తాపము గూర్పఁ జూడకుము ♦ ధర్మగుణాలయ! పుణ్యమూర్తి! నా
ప్రాపును గోరి రియ్యది వ ♦ రంబుగ నాకొఱ కీయ వేఁడెదం. ౧౪౫౪

చ॥ అనవుడు వేఁడుకోల? యిది ♦ యాజ్ఞయ కాదె? కృపానముద్రవౌ
జననివి! తల్లి పల్కు లెద ♦ జార్చు సుతుండు సుతుండె? మేలు! నీ
ఘనమతి నెంచి నట్ల యగుఁ ♦ గాకని పావని కేలుమోడ్పు గై
కొని యటనిల్చి జానకి క♦కుంఠిత మోదముఁ గూర్చుచుండఁగం. ౧౪౫౫

చ॥ అచట విభీషణుం బిలిచి ♦ యార్యుఁడు సీత నలంకరించి నీ
వి చటికిఁ దోడితెమ్మన న ♦ భీష్టము నందినభంగిఁ బొంగి యు
బ్బుచు దనుజప్రభుం డరిగి ♦ భూసుత సన్నిధి శీర్షక ప్రభల్
రుచిరముగా ధరం బరవ ♦ మ్రొక్కి నయంబు భయంబు పెంపునం.

శా॥ తల్లీ! కోరిన శత్రు వీర జయ మా ♦ ప్తంబయ్యె రాముండు నిం
వాల్లభ్యంబునఁ జూడఁగోరె దరిసిం ♦ పం వచ్చి రంగస్థలం
బెల్ల న్నిండిరి వేల్పు లచ్చటికి వే ♦ యింపారఁ దోడ్తేర న
న్నుల్లాసంబునఁ బంపె లెమ్ము లలి ను ♦ ద్యోగింపు కై సేఁతకుం. ౧౪౫౭

ఉ॥ నావుడు సీత యిట్టులను ♦ నాయిట నున్న విధంబు లెస్సగా
దేవతలుం దినేంద్ర కుల ♦ దీపుఁడు మానులు నాకలోక రా
జీవ దళాక్షులుం గనుట ♦ సెబ్బఱ గాదది యింతలింత లే
నీవిధి నొందియుం దుదకు♦నెట్లు రహింతు నలంకృతుల్ గొనం. ౧౪౫౮

తే॥ అనుచు జానకి వచియింప♦నసురవిభుఁడు, తల్లిరో! రామునాజ్ఞ చం♦దంబు నిట్లు
విన్నవించితి నన నామె♦విభునియాజ్ఞ, యిట్టులేయైన సరియని♦యియ్యకొనియె.

—: అప్సరసలు సీత నలంకరించుట :—

తే॥ జనకజ నలంకరింప న♦ప్సరస లేగు, దెంచి తిరుమంజనము సేయఁ♦దివిరి తగిన
పునుఁగు కస్తురి గంధ చం♦దనము తావి, తైల జలములఁ జేకూర్చి♦దాసినారు.

ఉ॥ స్త్రీల సులక్షణంబులకు ♦ క్షేత్రము క్రొత్తడి జాతి సొమ్ము మే
ల్లీలల కెల్ల మచ్చు కడ ♦ లిల వెలిదేఱిన వెన్నతోడు ధ
ర్మాలికిఁ దల్లియైన జన ♦ కాత్మజ యొంటి జడల్ వదల్చి రం
భా లలితాంగి వేదముల ♦ వ్యాసుఁడు నేర్పిన విచ్చుకై వడిన్. ౧౫౭౧

చ॥ తరమగు దొండఁబోలుచు ను ♦ ధామధురోక్తుల నొయ్యనొయ్య వె
ల్వఱచెడు నోట ముత్తెముల ♦ నంటి రదంబులఁ దోమి నెత్తికిన్
బరిమళ తైలమంటి మను ♦ వట్టిన రత్నము సానవట్టు న
ప్సరసున గీత మంగళ ర ♦ వంబులతో జలమార్చి రచ్చెలుల్. ౧౫౭౨

చ॥ పవడపుఁ దీవ నారజపుఁ ♦ బాల నురుంగున మూసియుంచు న
ప్పువిదిని చందనం బలఁది ♦ వక్షముపైఁ దగఁ జెందిరంబు సాం
కవమును మెత్తి మేల్కుసుమ ♦ కన్నియ వన్నియ పట్టుచీరయున్
సవరణచేసి మేఖలను ♦ సొరుగఁ దాల్చిరి సన్నకౌనుపై. ౧౫౭౩

సీ॥ ఇంద్రాణి తాల్పంగ♦నిమ్మగు రిక్కల, రహినొప్పు తారహా♦రంబుగూర్చి
విద్రుమోష్ఠమునకు♦విమలమౌ కుంకుమ, రసముఁబో ల్తాంబూల♦రసము దడవి
సంతనగాఁగ వ♦సంతంబు చుట్టి హా, రతి యెత్తి దేవతా♦రక్షచేసి
యబ్జమండలము నం♦దంకమృగంబన, హైమ విమానంబు♦నందు చేర్చి

తే॥ విబుధకాంతలుతనుచుట్టి♦వెలసియుండఁ, గవులుదైత్యులు గుంపులై ♦క్రందుకొనఁగ
వెడలఁ బాఱ నల్లల్ల వి♦భీషణుండు, నీరద శ్యామ గాత్రు స♦న్నిధికి వచ్చె.

తే॥ ఇవల మునులు సురలు వారి♦యింతులును ప్ర, మోదమున గుంపులై చేరి ♦ మురియుచుండఁ
దక్కువార లానంద వా♦ర్తలు వచించు, చింపుగాఁ జూచు వేడ్క వ♦హించి క్రమ్మ.

ఉ॥ ఉత్తమవంశ దీపిక య ♦ యోనిజ సాధ్వి పవిత్ర సద్గుణో
దాత్త చరిత్ర సీతను ము ♦ దంబునఁ జూడ్కఁగఁ గోరి గుంపులై
యొత్తుగఁ గూడి త్రోవ యిడ ♦ కుండఁగ దైత్యులు దండపాణులై
మొత్తి యదల్చి త్రోచిరి ప్ర ♦ మోదుల మోములు నల్లఁ బాఱఁగన్.

క॥ అత్తఱి రాముఁడు నందియు, మొత్తిన చిత్తంబుతోడ♦నుద్భ్రాంతంబున్
దత్తఱయగు ఱేలన ముని, సత్తము లట జరుగు తీరు ♦ చయ్యనఁ దెలుపన్.

క॥ అది వినియు వినక మున్నే, పెదవులు చలియింప దైత్య ♦ విభుఁగని యీ బె
ట్టిదముల నీవుండఁగఁ జే, యుదురే? తగునయ్య ప్రేమ ♦ యుతుల నలంపన్?

క॥ కదనంబుఁ జూచు వేడుకఁ, బదువులుగా వచ్చియున్న ♦ వారి నురక యి
ట్లదలించుచు దండింపం, బదరి యనుమతించు నతఁడు♦ప్రాజ్ఞుండగునే? ౧౪౧౯
ఉ॥ శూలియుఁ జక్రియు న్నలువ ♦ సుందరులన్ విడనాడి వచ్చుటల్
పోలునె; తక్కు వేలుపుల ♦ పొల్పులఁ దెల్పఁగనేల? తాపస
స్త్రీలును పూరుషుల్ ముదము ♦ చే నిటురా నదలించి మోఁదుచుం
దోలుట క్రూరకృత్యమగు♦దోసము సుమ్మిటు సేయఁగూడునే? ౧౪౨౦
ఆ॥ సాధు జనుల నిట్లు ♦ సడ్డసేయక యడఁ, గించి తఱుమఁగొట్టు ♦ టించుగాదు
వలదటంచుఁ గినిసి ♦ పలుక విభీషణుఁ, డడలుతోడ నొడలు ♦ వడఁక నిలిచె.
శా॥ సీతాదేవి రణాంగణంబును సమీ ♦ చీనంబుగాఁ జూచి త
ద్భూతక్షోణిని కంకగృధ్ర బలి భు ♦ గ్భూతాలికిం బందువుల్
ప్రీతింజేసిన రామభద్రు విలస ♦ ద్వీరాంక వేషంబు నెం
తో తృప్తింగనఁ దత్తఱించు హృదయాం ♦ దోళంబుతో వచ్చుచున్.
శా॥ నా పూతత్వము తేటగాఁ దెలిపి పై ♦ నా నాథు వీర్యంబు ను
ద్దీపింపం బొనరించి నాకులము కీ ♦ ర్తి న్నిల్పి యీలోకమున్
జూపం బూనిన మారుతాత్మజున కి ♦ చ్చో నా సతీత్వంబు సు
శ్రీ పెంపొందఁగ నిశ్చలంబగు చిరం ♦ జీవిత్వ మీఁ జాలునే? ౧౪౨౩
శా॥ నామేనిప్పు డశుద్ధమయ్యె ననువుల్ ♦ నాశిల్లి నట్లేయగున్
బ్రేమంబొక్కటి చూడ నాసగొని యు ♦ ర్విన్నిల్చె; వేఱొండు చే
తో మోదంబును కూర్ప లేదనుచు సం ♦ తోషించి సౌదామినీ
జీమూతం బననొప్పు చాపయుత రా♦జీవాక్షు వీక్షించెఁదాన్. ౧౪౨౪
చ॥ తొడరి సురాంగనామణులు ♦ తోడనురాఁగ విమానమందు వ
చ్చెడి జనకాత్మజాత తన ♦ జీవములన్ మరలన్ వహించు వ
వ్వడువున డిగ్గెఁ దన్ముఖము♦భాస్కర వంశ పయోధి సోముఁ డ
య్యెడ హృదయాంబుజం బలర ♦ నిమ్మగు సొమ్ముగఁ గాంచునట్లుగన్.
మ॥ ప్రతిజన్మంబున జీవితేశుఁడయి తో ♦ డ్పాటొంది దుర్జన్మ దుగ
ఖతతుల్ ద్రోచి ముదంబుగూర్చు నిజ హృ♦త్కాంతున్ మనోమోదన
స్థితి వీక్షించి భజింపఁగంటి నిఁక నే ♦ జీవించియున్నన్ నరే
గతియింపన్ సరె యంచు వీడినది యా ♦ కంజాక్షి హృత్తాపమున్.
క॥ ప్రేమస్వరూపుఁడగు శ్రీ, రాముఁడు వీక్షించె జనక ♦ రాజ కుమారిన్
రామాజన తిలకము సా, ధ్వీమణి సద్ధర్మకీర్తి ♦ దేవతను రహిన్. ౧౪౨౭
క॥ గ్రీష్మలత పోల్కినున్న వ, పుష్మతి తనపాదములకు ♦ మ్రొక్కినఁ గని యా
యుష్మంతుఁడు గనెఁ గన్నుల, శుష్మ మురలఁ జూచు దండ♦శూకముపోలెన్.

## —: శ్రీరాముఁడు సీతను కఠినోక్తు లాడుట :—

మ॥ నియతిం దప్పిన దైత్యునింటఁ గుల హా ♦ నిం గూర్చి నీచాన్నముల్
ప్రియమారన్ భుజియించి శీలమును బా ♦ విం ద్రోచి యున్నాళ్లు దు
ష్క్రియలన్ లజ్జను వీడి చావక యిటుల్ ♦ జీవంబుతో నుండి యే
భయముల్ లేకిట కేల వచ్చితివి? సం♦భావింతు నంచెంచితో? ౧౮౮౯

చ॥ నిను చెఱ వీడ్చి చేకొనఁగ ♦ నీరధి గట్టి నిశాచరాన్వయం
బును మొదలంటఁ గూల్చి రణ ♦ భూమిని రావణు సంహరింపలే
దినకుల గౌరవంబు మఱి ♦ యేను వహించిన ఱట్టుచేఁ గలం
కను వహియించు నంచుఁ గడఁ ♦ కం జనుదెంచితి వైరిఁ గూల్చితిన్.

చ॥ అమృతముమీఁదికంటె నధి ♦ కాసను ప్రాణుల మేని మాంసముల్
నమలుచు నాసవంబు వ్యస ♦ నంబుగ నానుచునుండి మాయెడన్
సుముఖత చూపుచుండు టెఁకఁ ♦ జొప్పడునే మరణించుదాఁకఁ? ప్రే
మమున నొనర్చు విందు లవి ♦ మామది కెంత రుచించునో కదా? ౧౮౯౧

తే॥ పావన కులంబునం జనిం♦పక ధరిత్రిఁ, గీటకము వలె జన్మించి♦కీడుపడఁగ
సత్ప్రవర్తన మడుగంట♦జార్చి జన్మ, సంపదకుఁ దగువని పూర్తి♦సలిపినావు.

చ॥ ఇలువడి సత్యవర్తన మ ♦ నీర్ష్య యసీచత శ్రీకరత్వముల్
లలిత విచక్షణత్వము క ♦ లంకములేని మనంబు కీర్తియుల్
గులసతి లక్షణంబు లవి ♦ కూల్చితి పట్టుగ నీదు పుట్టుచే
విలస దుదారతం గనని ♦ పృథ్విపు కీర్తిని పోలె దుర్మతీ! ౧౮౯౩

ఉ॥ ఉత్తమ వంశజాతలు వి ♦ యోగము గల్గినవేళ నింద్రియ
స్వాత్త నడంచి శీలమున ♦ భంగము కాని దిటంబు గల్గి సం
పత్తను భోగహీనతఁ ద ♦ పం బొనరింతురు మాన రక్షకై
చత్తురు గాని నీకరణి ♦ సౌఖ్యము లందరు శీల నాశినీ! ౧౮౯౪

చ॥ నిలువక పొమ్ము నామదిని ♦ నీదగు చేష్టలు ఱంపమట్లు గం
డ్రలుగను కోయుచుండె నెద ♦ వ్రయ్యఁగఁ జావును కాదయేని నీ
వలచిన చోటికేగి సుఖ ♦ వర్తన నుండుము నిన్ను గైకొనం
గొలుపదు బుద్ధి యంచుఁ గొఱుఁ ♦ గ్రుచ్చిన భంగి నదల్చి పల్కఁగన్.

చ॥ ఇనకులు పల్కులన్ విని య ♦ హీన గుణాత్మకులైన వేల్పుల్
మునులును వానరుల్ దనుజ ♦ ముఖ్యులుఁ దక్క నఖి జనంబులుల్
మనము కలంగఁబాఱ మఱు ♦ మాట వచింపఁగలేక బోరునన్
భనవిరి విహ్వలించిరి ప్ర ♦ పాతము నెందిరి సోలి ధాత్రిపై. ౧౮౯౬

శా॥ నేలం జూచుచు నిల్చినట్టి కరుణా ♦ నిష్పంద వారాశి సం
శీలవ్రాతము గాంచియాచి త్రిజగ ♦ చ్ఛిద్రాత్రి వైదేహి ని
ర్వేలా దుఃఖ పయోధి మున్గి వ్రణముల్ ♦ వేధింప బెగ్గిల్లు నా
లీలం గంపిలెఁ గుండె హా యనియె వ్రా ♦ లెన్ ధాత్రిపై దబ్బునన్.

శా॥ రామ క్ష్మావిభు వాక్కు నెత్తిపయి ని ♦ ర్ఘాతంబునాఁ గ్రుమ్మఁగా
భూమిం గూలిన సీత కర్మ మట సం♦బోధింపఁగా లేచి వాఁగి
క్షామ క్షోణిఁ దపించు నేణి జల భృ ♦ త్కాసారముం గాంచి పో
నేమార్గంబును లేమిఁ దల్లడిలు న ♦ ట్లీగెం దలంకించుచున్ ౧౪౮౮

ఉ॥ నీరును నెత్తురుం గలిసి ♦ నేత్రములం దిగజాఱ నేడ్చుచున్
దోరక నేను ప్రాణముల ♦ తో మనినట్టి ఫలంబు తాళఁగా
నేరని యిట్టి వాక్యముల ♦ నే వినఁ గావలయున్ మదీయ దు
ర్వార దురంత దుష్క్రియలు♦ప్రామఁగ నేరి మతేమనందగున్? ౧౪౮౯

మ॥ కరుణా సాగర! మారుతాత్మజుఁడు లం ♦ కం జేరి వీక్షించి నీ
వర కారుణ్యముఁ గూర్చి పల్కుచు సమా ♦ శ్వాసించెఁ గాకున్న భూ
భరమై యే మనుదాననే? యతఁడు నా ♦ బన్నంబుల న్నీకు వి
స్తర ఫక్కిన్ వచియింపఁడో? వినుత దూ ♦ తత్వంబు తాఁ జేయఁడో?

మ॥ పురుషోత్తంసమ! యింతకాలము శ్రమం ♦ బుం గొంచుఁ గాపాడు సు
స్థిర చారిత్రము సత్తపస్థితియుఁ బా ♦ తివ్రత్యముల్ సర్వముల్
బర మర్మజ్ఞ విచక్షణాం బయిన నీ ♦ భావంబు వీక్షింపమిన్
బరిసెన్ వీసరవోయె వీఁటిఁడి ప్రలా ♦ పం బట్లు వ్యర్థంబుగన్. ౧౪౯౧

మ॥ స్థిర పత్నీత్వము గల్గు దాన నన నా ♦ చిత్తంబె సాక్ష్యంబగున్
సరసీజాననుఁడేని నాదు హృదయ ♦ స్థైర్యంబు మార్పంగ లేఁ
డిరవారంగ రఘూద్వహుండె సభ న ♦ న్నిట్లాడుచో నింక మ
ద్వరు భావంబును మార్ప నేర్పుగల దై♦వ మ్మొక్కఁ డున్నే యెటన్?

చ॥ అజ హర చక్రులుం గరత ♦ లామలకంబుగ సర్వ కార్యముల్
త్రిజగములం దెఱుంగుదురు ♦ తేఁకువఁ గాంతల చిత్త సంస్థితుల్
నిజముగఁ గాంచలేరు మఱి ♦ నిర్మల నిష్ఠఁ బతివ్రతాత్వ మ
క్కజముగ నెవ్వరింకఁ గనఁ ♦ గా నొనరింతు? ఫలంబు నేమగున్?

ఉ॥ కావునఁ గాయముల్ విడుటె ♦ కార్యమగున్ భవదాజ్ఞ యట్టి స
ద్భావయుతంబ కాన నెడఁ ♦ దం గొదుకం బనియేమి యుండు? నా
చావును గోరుచుండె విధి ♦ చక్కటి యంచు మఱందిఁ గాంచి య
న్నా! వనమందు వోలెనె యి♦సర్పుము ప్రస్తర మొండు వహ్నితో.

ఉ॥ నాయన ! పుణ్యరూప! రఘు ♦ నాథుఁడు పల్కిన పల్కు వింటె ? నా
కీ యవశిష్టకార్యము ర ♦ హింబుయిలోటము మాని క్రచ్ఛఱం
జేయుము యన్న నాతఁడును ♦ చేడ్పడి దుస్సహ వేపమాన చిం
తాయత నాంతరంగుఁడయి ♦ యన్న మొగంబును కాంచె నత్తఱిన్.

మ॥ జలజాతేక్షణు సమ్మతిం దెలుపు సం ♦ జ్ఞం గాంచి స్వప్రాణముల్
వలవంజాలని లక్ష్మణుండు వగతో ♦ వాపోవుచున్ వెక్కుచున్
బెలుచం గట్టెలు తెచ్చి పేర్చి యనలున్ ♦ ప్రేరేఁచె వైదేహి ని
శ్చల చిత్తంబునఁ జేరవచ్చె జనముల్ ♦ సంతాపముం బొందఁగన్.

—: సీత యగ్నిం జొచ్చుట :—

సీ॥ లోకజనని వహ్ని ♦ లో డిగ డాయంగ, వేదంబులెల్ల వా♦విడిచి యేడ్చె
ధర్మదేవత యెదఁ♦దల్లడిల్లెను ప్రద, క్షిణము సేయఁగఁ బ్రాణి♦గణములేడ్చె
నమరకాంతలు బోరు♦మన్ని విలపించిరి, బ్రహ్మయుఁ గూడని♦పగిది యనియె
హరుఁ డక్రమంబనె♦హరిరాజు బెగ్గిలె, భల్లుకేంద్రుఁడు పార♦వశ్యమొందె
తే॥ విన్నఁదనమొందె వెగచి వి♦భీషణుండు, సుక్కి సుక్కి సౌమిత్రియు♦సొమ్మవోయె
చెడితిరా యంచుహనుమ ప్రా♦న్పడియె రామ,విభుఁడునిర్విణ్ణుఁడై చాల♦ వెగడుగుడిచె.

సీ॥ అనుచితంబని సుర♦లన్యాయమని సాధ్య, లాగడంబని యక్షు♦లనుచునుండ
ఎడకడయని సిద్ధు♦లెగ్గని యురగులు, తగని పాడియని గం♦ధర్వు లనఁగ
గరుడు లాక్రందింప♦ఖగములు విలపింపఁ, బంచభూతంబులు♦పరితపింప
దనుజులు మిడుకంగ♦మనుజులు నడుకంగ, స్థావర జంగమ♦తతి గలంగ
తే॥ శేషుఁడొదుఁగంగలోకముల్♦శోషిలంగ, గ్రహచయంబులు తమతమ♦గతులుదప్ప
సాగరంబులు రోదన♦స్వనము నింప,ధారణీజాత యగ్నిం బ్ర♦దక్షిణించె. ౧౪౯౮

చ॥ వలగొని నిల్చి రామ పద ♦ వారిజముల్ మదినుంచి యో మహా
నల! సకల క్రియాధికర ♦ ణా! వినివారిత లోక కల్మషా!
చలమతినై మనంబున వ ♦ చస్సునఁ గర్మల నెన్నఁడేనియున్
గలఁక వహింతునేని నను♦కాల్పుము బూది యొనర్పు పావకా! ౧౪౯౯

తే॥ నియతి నిట్లు ప్రార్థించి యా♦నీరజాక్షి, తనదు కాణాచియైన చెం♦దమ్మియందుఁ
చొచ్చునది వోలెఁ జిచ్చునఁ♦జొచ్చి నిలిచె, సర్వ జీవులు మనముల♦సంతపింప.

చ॥ అవనిని సర్వభక్షకుఁడ ♦ నై యపవిత్రుఁడనైన యేను నీ
యవనిజ సోఁకుచేత విమ ♦ లాత్ముఁడ నయ్యెదనంచు నుబ్బు నా
పవన సఖుండు నగ్గరిత ♦ పావన పావక కీల మూఁడి రా
ఘువు కడ కేగుదెంచెఁ గర ♦ కంజములన్ వహియించి జానకిన్. ౧౫౦౦

మ॥ పతి వీక్షించిన కిన్కచే నయిన తా ♦ పస్వేద బిందు వ్రజ
స్థితి యొక్కింతయు మాఱలేదు జడలోఁ ♦ జెల్వారు నవ్యాబ్జ సం
తతి సుంతేనియు వాడలేదు కనుమీ ♦ తాత్పర్య యుక్తుండవై
దితి వంశాంతక! నిష్కళం జెదలు ధా ♦ త్రిం దాఁకునే యెన్నఁడేన్?

శా॥ నా దౌర్బల్యము సుంతయేని మది నె ♦ న్నంబోక కోపంబుతో
వైదేహిం గన నామె స్వీయ మహిమా ♦ వహ్నిం దగుల్వడ్డ నా
దా దౌర్భాగ్యము నేమియందు? మఱి నా ♦ యత్యాహితం బేదియున్
లేదే? నాపయిఁ గిన్క యేలొకో? జగ♦ల్లీలా మహానాటకా! ౧౫౦౩

మ॥ అని ప్రార్థింపఁగఁ గాంచి లోకములు స్వా ♦ స్థ్యంబొందె బెగ్గిల్లి సో
లిన ప్రాణంబులు నెమ్మదిం గొనియె వి ♦ క్లేశంబు సంధిల్లఁగా
ముని పత్నుల్ సురదైత్య కాంతలును స ♦ మ్మోదాత్మలై యేచి ల
జ్జను పాటింపక గంతులేసి రెవరా ♦ సంతోషముం బొందరో? ౧౫౦౪

మ॥ గురు మోదంబున వానరావళు లొగిన్ ♦ కోలాహల ధ్వానముల్
పరఁగం జేసెను రాముఁ డయ్యదనునన్ ♦ వైశ్వానరుం గాంచి దు
శ్చరితం దీని దహింపకిట్లు కరుణన్ ♦ శాంతుడవై కాచు టె
వ్వరి యాదేశము? నీవెవండ? వన భా ♦ స్వద్వహ్ని తా నిట్లనన్.

సీ॥ నే నగ్నిదేవుండ ♦ నీదేవి వైదేహి, తనదు పాతివ్రత్య ♦ దహనుచేత
దహియింప సహియింప ♦ దలము గాకిటు నిను, శరణంబు వేఁడితి ♦ సంశయింతు
వేలొకో యెఱిఁగియు ♦ నెఱుఁగనికైవడి, జగములయందున ♦ సతులు పతుల
నడసియుండిన సంశ ♦ యించుట సందేహ, ములఁ బలువిధములఁ♦గలఁకలేని

తే॥ కరణిఁ దొలఁగించుకొనుట నా♦కడన జరుగు, చుండుటయు లోక సహజమై ♦ యుండుఁగాని
యామెచే నేను శుద్ధుండ నగుచునుండ, నామె పరిశుద్ధురాలని♦యనఁగనేల?

సీ॥ సత్యశీలుండగు ♦ సామీరి పలుకుల, మన్నించి చేపట్ట ♦ కున్న నీవు
శంకానివృత్తి ని♦శ్చయరీతిఁ జూపు నా, నయ వాక్యముల నెంత♦నమ్మఁగలవొ?
అమరులు మునులు లో♦కములు హాహాకార, మొనరించుచుండుట♦వినఁగ రావొ?
ధర్మంబు వీడి య♦ధర్మంబుపై బుద్ధిఁ, గూర్చు విధంబెందు♦నేర్చికొంటి?

తే॥ పూతచారిత్ర కోపంబె♦పూనునేని♦మొగులు కురియునే? మేదిని♦పగులకున్న?
తగవు నిలుచునె? జగములు♦తలరకున్న?, అంబుజభవుండు గడగడ♦లాడకున్నె?.

తే॥ అనుచు వచియించి తపియించు♦నగ్ని విబుధ, వరులు గొనియాడ జీవులు♦వనటనీఁగ
సీతఁ గొని తెచ్చి రాముని♦చెంత నిలుప, నతఁడు కారుణ్య సహితుఁడై♦యనియె నిట్లు.

ఉ॥ నీవు సమస్త జీవులకు ♦ నీతి తొలంగని సాక్షివౌటచేఁ
బావని లోక నిందలకుఁ ♦ బాత్రముగానిది సీత యంచు సం
భావనసేసి పల్కితివి ♦ బంధురరీతిఁ బరిగ్రహించెదన్
దేవిని వానరావళియు ♦ దేవతలుం బరితోషమందఁగన్. ౧౫౦౯

మ॥ అని వాక్రువ్వ సమస్తలోకము లపా ♦ రానందముం బొందె బ్ర
హ్మాను గీర్వాణులు గాంచి తాని తన మా ♦ యన్నిల్చి సామాన్యుఁడౌ
జనునిం బోలెను తన్నుఁ దా నెఱుఁగకీ ♦ చందాన నున్నట్టి రా
ముని పూర్వస్థితిఁ దెల్పవే యనుడు వే ♦ ల్పుంబెద్ద తానిట్లనున్. ౧౫౧౦

—: రాముని పురుషోత్తమత్వమును నలువ వెల్లడించుట :—

శా॥ శ్రీరామా! పురుషోత్తమా! రవికుల ♦ శ్రేష్ఠుండవే నీవు? నా
మేర న్నిల్చిన యల్పబుద్ధి నగు న ♦ న్నిర్దిష్టోక్తి సైరింపు నీ
తీరుం దెల్పఁగ శక్తిలే దుపనిష ♦ త్సిద్ధాంత తత్త్వంబ వా
ధారాధేయము లీవ సర్వమును నీ ♦ తత్త్వంబ లోకేశ్వరా! ౧౫౧౧

మ॥ తొలి తత్త్వంబగు మాయయున్ మరల నం ♦ దుంబుట్టు తత్త్వంబు ల
వ్వలఁ బైనుండెడు జీవుఁడున్ దనకుఁ బై ♦ భాస్వత్ప్రభా రాశియై
తలఁపం దెల్ప వచింపరాని పరమా ♦ ర్థం బీవ నీమాయచేఁ
గలుగు న్నిల్చు నశించు లోకములు సం ♦ కల్ప ప్రభావంబునన్.

చ॥ తొలిస్థితియైన సృష్టియును ♦ తుట్టతుదిం గల నాశమున్ సదా
చెలఁగని నీస్థితి న్నిగమ ♦ శీర్షములే పరమార్థమంచు ని
న్నొలసి వచించుఁగాని మఱి ♦ యొక్కరి నిక్కడ కేగుదెంచు వా
రలఁ గలవానిఁ దెల్పవు ప ♦ రాత్పర! సర్వ జగన్నియామకా! ౧౫౧౩

చ॥ శివునకు నాకు నింద్రునకు ♦ శిష్ట జనాళికి జీవరాశికిన్
దవిలియుఁ దొలకుండు పర ♦ తత్త్వము నీవని శాంతిఁ జేసి ని
క్కువము నెఱుంగు పుణ్యజన ♦ కోటి భవాంబుధి దాఁటి దేవతా
స్తవన విశేష పాత్రమగు ♦ సత్యపదంబును కొంద్రు రాఘవా! ౧౫౧౪

మ॥ తలిదండ్రుల్ తమ జన్మకారకులుగాఁ ♦ దర్కించు నజ్ఞుల్ ధరా
స్థలిలో సంసృతి పాశ బద్ధులయి సం ♦ తాపించి తత్త్వార్థమున్
దెలియంజాలక చావు పుట్టువుల యా ♦ ర్తిం గుందుచున్నారు వి
జ్ఞులు నీతత్త్వ మెఱింగి ముక్తులయి సం ♦ శోభింతు రెల్లప్పుడున్. ౧౫౧౫

చ॥ ఇరువది యైదు తత్త్వముల ♦ కీవలి తత్త్వము నీవుగాక వే
రొరువుఁడు లేఁడటంచు శ్రుతు ♦ లొక్కటఁ జాటుచునుండె నుత్తముల్

కరులగు వారు దీని కిఁకఁ ♦ గావలెనే వ్యవహార ధర్మమం
దొరిమిక సాక్షి నమ్ముటకు ♦ నుత్తర సాక్షిని పోలె నిద్దరన్. ౧౫౧౬

మ॥ అనుమానాదిక సత్ప్రమాణగతి నూ ♦ హాపోహముల్ సేత నీ
గన సాహాయ్యపడంగలేవు వనజా ♦ క్షా! వేద శీర్షంబులున్
నిను నీ డావలికంబు పూర్తిగఁ గనన్ ♦ లేకున్న విజ్ఞాన వీ
క్షణచే జాడగ నిర్ణయించి తెలుపున్ ♦ సర్వేశ! సర్వాత్మకా! ౧౫౧౭

ఉ॥ నీ కరుణా విశేషమును ♦ నెమ్మి వహింపని వారి కింద్రియో
ద్రేకము విఘ్న కారకము ♦ దివ్య భవద్గుణ రూపలక్ష్మిన
స్తోకముగా నెఱుంగుటకుఁ ♦ దూకొని యింద్రియ శక్తిఁ గ్రుంచ నీ
శ్రీ కమనీయ పాద సర ♦ సీరుహ చింతన దక్క నున్నదే? ౧౫౧౮

శా॥ నీకుం బుట్టువు లేదు మాయయుఁ దొలి ♦ న్నీనుండియే పుట్టె నీ
యాకాశాదిక పంచభూతములు త ♦ త్త్వాదుల్ ప్రపంచంబు మా
యాకార్యంబులు కల్పకాలమున మా ♦ యన్ డిందు నమ్మాయ నీ
యాకారంబున డిందు నీకు విలయం ♦ బా లేదు నిత్యాత్మకా! ౧౫౧౯

మ॥ మించుం బోలె క్షణంబులో నడఁగు ని ♦ మ్మిథ్యా ప్రపంచంబు సృ
ష్టించం బెంచఁగ ధర్మము న్నిలుప సు ♦ శ్రీసంప నేకాకివై
ప్రాంచద్రీతిని నన్ను వెల్వఱుతు వం ♦ త్యంబందు నాశంబు గ
ల్పించం బూనెదు డాఁగియుండవును తృ ♦ ప్తిం గానరా వెన్నఁడున్.

శా॥ నారూపంబున సృష్టిచేసి జగముల్ ♦ నారాయ ణాఖ్యుండవై
యారం బోషణ చేసి శూలివయి సం ♦ హారంబు గావింతు వీ
వారా! రే పవళుల్ దినేశ్వరుఁడు ప్ర ♦ త్యక్షంబుగాఁ జేసి లో
కారాధ్యుండును లోకబంధుఁడగు చా ♦ యం బొంది సర్వేశ్వరా!

శా॥ సంపన్నాంధత నొందు మూ మదము నా ♦ శంబంద నక్తంచరుల్
చంపన్ యత్నముచేసి పాఱఁదఱుమన్ ♦ సంరక్షకై నిన్న ప్రా
ర్థింపన్ మాకయి పెక్కుజన్మములు ప్రీ ♦ తిం బొందుచున్నావు నీ
కింపుం గూర్చెడి యాటలో విధులొకో ♦ యీకార్యముల్? రాఘవా!

మ॥ ప్రణవార్థంబు నెఱుంగువారె పరమా ♦ ర్థంబైన నీతత్త్వమున్
గణనీయంబుగఁ గాంచువారలును ము ♦ క్తద్వేషులున్ ముక్త బం
ధనులున్; దక్కినవారు సంచలిత త ♦ త్త్వజ్ఞానులై జన్మ కా
రణ మాయంబడి ముక్తి మార్గమును చే ♦ రం బోవ రెన్నాళ్లకున్.

క॥ నీరూప మిట్టిదయ్యెను, గారాముగ జగములెల్లఁ ♦ గాంచి పెనిచి ధ
ర్మారూఢిఁ జూపు జననిని, కారాని వచస్సులాడి ♦ కలఁపకు తండ్రీ. ౧౫౨౪

—: శంకరుఁడు దశరథు నటకుఁ బిలిపించుట :—

క॥ అని నలువ పలుకఁ బశుపతి, యను నీవు జగంబులకు న ♦ నాదివి త్రిజగ
జ్జననియగు సీత లక్ష్మియె, యనఘా! నీచరిత నీవ ♦ యరయఁగలేవో? ౧౫౨౫

మ॥ జనలోకేశ్వర! సీత వీడఁదగు దు ♦ శ్చారిత్రయే? లోక పా
వన చారిత్రను శంకచేసి విడువన్ ♦ భావింతువే నిన్ జగ
జ్జని సందోహము తల్లడిల్లి తుది నా ♦ శంబందు నక్లాట దే
విని నిందించుట మాని చేకొనుము మా ♦ వేఁడ్కోలునన్ రాఘవా!

చ। పశుపతి యిట్లు పల్క సుత ♦ బాధ వియోగ మహోగ్ర వేదనా
వశమున జీవము ల్విడిచి ♦ వైష్ణవలోకము నొందియున్న యా
దశరథుఁ జేరి సీతనయు ♦ దండకు వచ్చి తదీయ చిత్త క
ర్కశతను మాన్పి మోదము జ♦గంబులకుం గలిగింపవే యనన్. ౧౫౨౭

మ॥ భవు నాజ్ఞం గొని ప్రేమపాత్రమగు క్ర ♦ వ్యాదాన్వయధ్వంసి రా
ఘవు వీక్షించు కుతూహలంబు మది నూఁ ♦ గంజేయ నుత్కంఠయుం
దవులం బంక్తిరథుండు భూమికి దిగెన్ ♦ దండ్రిన్ సమీక్షించి దా
నవభీముండగు రామభద్రుఁ డెరఁగెన్ ♦ దత్పాద పద్మద్వయిన్. ౧౫౨౮

చ॥ తెలచిన సూను బాహువులఁ ♦ దియ్యములోఁ దగ గ్రుచ్చి యెత్తి కౌఁ
గిలిగొని బాష్పవారిఁ జిలి ♦ కించుచుఁ జెక్కుఁగఁ జేర్చి నా భవం
బిలఁ గడు ధన్యమయ్యెనని ♦ యింద్రియవారము తృప్తి నెందఁగాఁ
దొలఁగ వియోగవేదనయు ♦ దుర్భర మోదముతోడ నిట్లనున్. ౧౫౨౯

ఉ॥ కేకయరాజపుత్త్రి మది ♦ గీడ్పడఁ గోరు వరంబు శూలమై
యూఁకున నామదిం దొలుచు ♦ చుండెఁ గుమారక! నేఁటిదాఁక నీ
లోకహితంబు పేర్మి నత ♦ లోక జయేందిర చేరి మించు సు
శ్రీకమనీయ వక్షమిటు ♦ చేరఁ దొలంగెను నేఁడు నాయనా! ౧౫౩౦

ఉ॥ ఉత్తమ పుత్త్రులం గని మ ♦ హోన్నతి నొందిన వారు మత్పదా
యత్త రజంబునేని సమ ♦ మందని యుద్ధుర గౌరవంబు నా
కిత్తఱిఁ గూర్చినాఁడవు మ ♦ హేచ్ఛను నీవలనన్ గడించితిన్
సత్తమలోక సౌఖ్యమును ♦ శాశ్వతకీర్తి జగత్త్రయంబునన్. ౧౫౩౧

మ॥ మును నాచేత నమస్కృతుల్ గొనిన వే ♦ ల్పుల్ తాపసశ్రేష్ఠులున్
నను సంస్తోత్రము సేయ నిప్పటి జగ ♦ న్మాన్యాంగముం జూడుమా
వనజాతాసను నుద్దిగా వినుత భా ♦ వస్ఫూర్తిఁ గల్పించి తీ
వని సంతోషము మీఱఁ బల్క మిథిలా ♦ ధ్యక్షాత్మజం జూడఁగన్.

చ॥ జనకజయున్ మహా వినయ ♦ సంగతయై పద పంకజాత వం
దన మొనరింప నా మెను ము ♦ దంబున లేవఁగనెత్తి ప్రేమమున్
దనుక శిరంబు మూరుకొని ♦ తల్లిరో! నీవలనన్ నిజంబుగా
నినకుల ముజ్జ్వలించె లభియించెను నాకును నిత్య సౌఖ్యముల్. ౧౫౩౩

శా॥ పాతివ్రత్యబలంబు లోకులకుఁ దె ♦ ల్పంబూని నీభర్త యీ
రీతిన్ పీతియుతోగ్రవహ్ని దుముకం ♦ బ్రేరేఁచు నవ్వార్త నీ
చేతంబందున నిల్పకమ్మ! జనముల్ ♦ చిత్తంబు శంకించుచో
హేతిన్నిల్పి పరీక్ష సేయుటలు బ్రాఁ ♦ తే? కోపము న్మానుమా!

ఉ॥ బంగరు నిప్పునం దిడుట ♦ వన్నియ హెచ్చొనరింపఁ జుమ్ము! సా
రంగ విలోచనా! సుగుణ ♦ రాజిత చిత్తుఁడు నీమగండు మీఁ
దం గొనరాదు అట్టు వసు ♦ ధాస్థలి నంచుఁ దలంచి యిప్పు డీ
యంగమునన్ విధించి వెల ♦ యంగ నొనర్చె భవన్మహత్త్వమున్.

చ॥ పరమ పతివ్రతా మణుల ♦ పాలి విభూషణమా! ధరిత్రియే
వరతర జన్మభూమి యగు ♦ వైష్ణవ లోకమునుండి ధారణీ
భరమును మాన్పఁ బూంటె ఖగ ♦ వాహనుతోడ జనించి తీవు నీ
యురు గుణరాశికిం గలఁక ♦ యొంటునె యొక్కటి? లోకపావనీ? ౧౫౩౬

చ॥ అని వచియించి యించుకయు ♦ నల్క వహింపని శాంతచిత్త యీ
జనకజ యంచు డెందమున ♦ సంతసమంది యనంతరంబు నె
మ్మనమును ప్రేమ కట్టుటయు ♦ మచ్చికతోడ విభుండు తన్నుదా
ఘనముగఁ గౌఁగిలించుకొను ♦ కైవడి నక్కునఁ జేర్చె లక్ష్మణున్,

మ॥ కనుల న్నీరు జటాభరంబుఁ దడుపన్ ♦ గాటంబుగాఁ జేర్చి యో
తనయా! యన్నను వెంటనంటి సుఖ ని ♦ ద్రాభుక్తులం ద్రోచి యా
తనిఁ గాపాడుచు లెక్కలేని భవ బం ♦ ధంబుల్ వెనంద్రోచి నా
ఘన చిత్తాధుల నీఁగినాఁడవు కదా ♦ కారుణ్య వారాన్నిధీ! ౧౫౩౮

మ॥ బలు మాయావిని మేఘనాదు ననిలో ♦ భంజించి గెల్పొందు నీ
బల చాతుర్యము లెల్లవేళలను గీ ♦ ర్వాణుల్ ప్రశంసించు వా
రలు లోకంబుల గాసిపెట్టు దనుజ ♦ వ్రాతంబుఁ జెండాడి ని
ర్మల ధర్మంబును నిల్పినాఁడవు జగ ♦ న్మాన్యుండవై పుత్త్రకా! ౧౫౩౯

చ॥ అని వచియించి రామ విభు ♦ నర్మిలిఁ గాంచి గుణప్రపూర్ణ! నీ
కొనరఁగ నీయ సాధ్యమగు ♦ నొండు వరంబును వేఁడుమన్న న
య్యనఘుఁడు పల్కు మిమ్ము మొగి ♦ నవ్వలి లోకమునందు గాంచి మ
న్నన దగ వేఁడనుంటి నది ♦ నాకు లభించె నిఁకేమి కోరుదున్?

చ॥ అయినను కోర్కె యొండు గల ♦ దయ్య! మనంబున దుష్ట శీలఁగాఁ
గయికొని చూడ రోఁతవడు ♦ కైకయుఁ దత్తనుజుండు నాకుఁ ద
ల్లియు ననుజుండుగా నవధు ♦ రింప వరంబు ననుగ్రహింపుమీ
మొయికొని యన్న నెల్లరును ♦ మేలని మెచ్చిరి రాము చిత్తమున్.

మ॥ అకలంకుండగు తమ్ముఁ డట్టి యతఁడే ♦ యాఁ బట్టభంగబు త
క్కక కావించి తపస్విరూపమును పైఁ ♦ గాంతారవాసంబు గొం
కక నీకిచ్చిన క్రూరదైత్యయగు నా ♦ కైకేయిపైఁ గోప మిం
చుకయుం దగ్గద యంచుఁ దండ్రి యన ర ♦ క్షోమర్దనుం డిట్లనున్.

మ॥ పౌరపౌచ్చంబులు లేక యుండఁగఁ బ్రజల్ ♦ బోషింపఁగాఁ బూను నా
ధరణీభారము సర్వపాపములకున్ ♦ స్థానంబయా నంచు వి
ద్వరులెల్లన్ వివరింపఁగా నెఱిఁగి త ♦ త్కార్యంబు నీకొంట నా
నెరసైయున్నది గాక తల్లియెడ మ ♦ న్నింపన్ దోసంగున్నదే? ౧౫౪౩

చ॥ వర బల మానముం గడచి ♦ వర్తిలు రాఘవుఁ డిట్లు వల్కఁ బం
క్తిరథుఁడు కిన్కమానెఁ బరి ♦ కించిన విన్న మునీంద్ర నిర్జరుల్
వరములు రెండు కోరె మును ♦ వారక కైకయు రాముఁ డిప్పుడున్
వరములు రెండె కోరెనని ♦ వందుల పోల్కి నుతించి రయ్యెడన్. ౧౫౪౪

మ॥ సకలామోదక సత్య రక్షణముకై ♦ శస్తంబుగాఁ గీర్తి వ
ర్ధక దేహంబును గొన్న భూ విభుఁడు సీ ♦ తారామ సౌమిత్రులన్
బ్రకటప్రేమను భూమిపై నిలువ నా ♦ జ్ఞాపించి యారెండు కో
రికలన్ వారల కిచ్చి తా మరలెఁ గీ ♦ ర్తింపంగ బృందారకుల్. ౧౫౪౫

—: వేలుపులు రాముని కోరిక లొసంగుట :—

ఉ॥ కూటువలైన ఖేచరులు ♦ కూర్మిని రాముని గాంచుచున్ నిరా
ఘాటముగాఁగ నీవలచు ♦ కార్యము కూర్తుము కోరుమన్న నీ
పోటునఁ గూలినట్టి కపి ♦ ముఖ్యులు ప్రాణములొంద వార లే
చోటునఁ జేరిరన్ వలయు ♦ చొక్కపు టోగిర మొందఁ గోరుదున్.

చ॥ వరదులు బ్రహ్మరుద్రులు త ♦ పస్వులు నిర్జరులున్ గకుప్పతుల్
పరము ననంతు నవ్యయు భ ♦ వప్రకరంబులఁ ద్రుంచు నచ్యుతున్
పరిపరి రీతులం దనియఁ ♦ బ్రార్థనముల్ పొనరించి నీకృపా
నిరతిని పొందుఁగావుత వ ♦ నేచరవర్గము కోరినట్లనన్. ౧౫౪౬

చ॥ కదనము పూను నాఁటఁగొలె ♦ గండటి నీల్గిన వానరావళుల్
ముదమున జీవముల్ గొని ప్ర ♦ పూర్ణబలంబున లేచి పోరికై

పొదలుచు హుంకృతుల్ సలిపి ♦ మోములు కన్నులు తృప్తినొంద శ్రీ
సదనుని గాంచి జే యనుచు ♦ నందడి సేయుచు డాయు సంతటన్. ౧౫౪౮

సీ॥ వేల్పులు రామని♦ వేడ్కతోఁ గాంచి యి, ట్లనిరి వివేచించి♦యాదిదేవ!
వనచరసేనతో♦వచ్చి కృష్ణాష్టమి, వేళ సువేలపై ♦విడిసి నాఁడె
పోరు ప్రారంభించి♦పోలసుదిండులఁ గూల్చి, పౌలస్త్య నని సమా♦వాస్యఁద్రుంచి
లోకంబులకు మేలు♦శోకతోఁ జేసితి, విట్టులే పదునాలు♦గేండ్లు కడచె
తే॥ నేఁడు పంచమి నీవేగి♦నియతు భరతుఁ, జేరవేసి యాతఁడు కూలుఁ♦జిచ్చునందు
సరగ నడువుము యని పల్కి♦సన్నుతించి, తమ నివాసంబులకు నాజ్ఞఁ♦దరలినారు.

—: సీతా రామ లక్ష్మణులు పుష్పకము నధిరోహించుట :—

తే॥ గడువు నేఁటితోఁ దీఱితి♦మ్ముఁడు గతింప, మా కులంబును నశియించు♦మాఱు లేదు
కాన నేఁడె చేరఁగఁదగు♦కర్జమునకు, వలయు సాధన మున్న దే♦తెలుపవయ్య!
సీ॥ రాముఁ డిట్లని త త్త♦ఱంపడఁగని విభీ, షణుఁడను దేవ పు♦ష్పకము కలదు
పౌలస్త్యుఁడు కుబేరు♦భంగించి కొన్నది, వానికిఁ బరమేష్ఠి♦దీని నొసఁగె
నుత్తమ జనముల ♦ చిత్తంబులంబలెఁ, బరిశుద్ధమైనది ♦ వనచరాళు
లెల్ల రెక్కినఁ జలి ♦ యింప దందేగినఁ, గోరి నేఁడె యయోధ్యఁ♦జేరవచ్చు
తే॥ ననుడు వడిగఁ దెప్పింపుమా♦యనుచు రామ
చంద్రుఁ డానతి యిడలోక♦చయ ముఁబోలు
పఱపు వేయి సూర్యులఁబోలు♦మెఱుపు గలుగు
పుష్పకంబు దైత్యేంద్రుఁడు♦పొసఁగఁ దెచ్చె.
తే॥ పుష్పకము ధారణికి డిగ్గ♦భూవరుండు, నేఁడు నిజముగ నాకోర్కి♦నెగ్గుననుచుఁ
దలఁచి దాని నధిష్ఠించె♦దత్తఱమున, విరులు విచ్చల విడిగ ఖే♦చరులు చల్ల.
తే॥ త్రిజట కేల్మోడ్పఁ గాంచి వైదేహి నీవు, లంక కధిదేవతంబోలి♦లలితరీతి
శుభము లొందుదు గాకని♦సుభగు సజ్జఁ, జేరె సూర్మిళేశుఁడు నధి♦ష్ఠించెనంత.
ఆ॥ విలయ వేళ నాఁటి♦వెన్నని యుదరంబుఁ, బోలి గగనమందు♦పొలుపు గొలుపు
పుష్పకమున నున్న♦భూపాలచంద్రుండు, హితులఁగాంచి ప్రేమ♦నిట్టులనియె.
తే॥ నలువ వంశంబు నీదాట♦తలఁపుమయ్య, నిన్ను చేరువారికి మేలె♦నించుమయ్య
పెంపు సొంపార లంకఁ బా♦లింపుమయ్య, యనుచు నవ్విభీషణునకు♦నాజ్ఞయొసఁగె.
తే॥ పంక్తికంధరు నీభుజ♦బలమువలనఁ, గూలిచితి దురమునఁ గ్లాంతి♦గూరియున్న
వానరులఁగొని నీపుర♦వరముఁ జేరి, సుఖివి గమ్మని సుగ్రీవుఁ♦జూచి యనియె.
తే॥ మీమనోబలోత్సాహ సం♦మ్మేళనమునఁ, గాక యే నింత పని సేయఁ♦గలనె! వాలి
తనయ! భల్లుకేశ్వర! నీల! పనస! యనుచు, ముదితుఁడై పల్కి సామీరి♦ముదలయడిగె.

ఆ॥ వారు దిగులుతోడఁ♦బ్రాణంబులు నొడళ్లు, వడఁకఁ గనుల నీరు♦పుడమిఁ దడుప
నిన్ను వీడి జీవ♦నిచయంబు భరియింపఁ, జాలమనుచు మఱియు♦జాలినొంది.

ఆ॥ కోసలంబు చేరి♦గురుతర పట్టాభి, షేక వేషమందు♦స్మితముఁగాంచి
పరమ మోదమంది♦మరలునట్లుగఁ గృప, సేయవయ్య వేడ్క♦చెలఁగు ననుచు.

మ॥ విమలప్రేమ విభీషణాదులు కపుల్ ♦ వేఁడంగ శ్రీరాముఁ డ
ర్యమవంశాంబుధిసోముఁ డా హితుల చి ♦ త్తావేగముం గాంచి సం
భ్రమ మేపారఁ గలంగకుం డిదియె నా ♦ భావంబు మిమ్మిట్లు దుః
ఖమునం ద్రోచి గడించు భాగ్యమది యే ♦ క్కండేని నాకుండునే?

మ॥ భరతత్రాణము వేగిరింప నిటులే ♦ భాషించితిన్ మిమ్ములం
బరిశోధింపఁగఁ గాదనం గపులు భా ♦ స్వత్పుత్త్రుఁడున్ దైత్య భూ
వరుఁడున్ మారుతి బొందితో సురపురిం ♦ బ్రాపించు చందాన సం
బరమున్ మోదము నొంది మ్రొక్కి రెలమిం ♦ బాటించి భూజానికిన్.

తే॥ కపులతోడ సుగ్రీవుని♦గాడ్పుకొడుకు, నల విభీషణుఁ దక్కువా♦రలను వడిగ
నెక్కుఁడీ విమానం బని♦యెలమి రామ, చంద్రముఁడు సెలవిచ్చెను♦సంభ్రమమున.

తే॥ పలుకువార్తయే వెనుబడు♦పగిది నేడు, పదుల వెల్వలు వానర♦పతి విభీష
ణుండు నంగదుఁ డాంజనే♦యుండు నెక్కి, యొక్క ప్రక్కఁ జేరిరి చాల♦నుత్సహించి.

తే॥ పదియునాలుగుజగముల♦ప్రాణులొక్క, మొగినికూర్చున్న నుస్థలంబు♦మిగిలియుండు
దద్విమానమహిమ కర్మ♦తతి దహించు, జ్ఞానులకెగాక తెలుప భూ♦జనులకరిది.

క॥ వనచరులు వనచరేంద్రుఁడు, దనుజులు దనుజేంద్రుఁడును ము♦దంబునఁ గొలువన్
జనకజతోఁ దమ్మునితో, మనుజేంద్రుఁడు వెలసె వేల్పు♦మన్నని క్రియన్. ౧౫౬౬

తే॥ పుష్పకమ్ము గొప్ప జగమ్ముఁ♦బోలి వెలయ, రాముఁడయ్యెడ లోకకా♦రకుఁడు నిర్వి
కారుఁడు నిరంజనుఁడు స్వప్ర♦కాశ పుంజ, మగు పరంజ్యోతి పరమాత్ముఁ♦డనఁగనొప్పె.

క॥ వానరనాథుండును లం, కానాథుఁడు దైత్యచయము ♦ కపి బృందంబుల్
మానవనాథుని యాజ్ఞను, మానవ రూపములఁ గొనిరి ♦ మక్కువతోడన్.

తే॥ తూర్పు పడమరలకు నేగు♦తోయజహితుఁ, డప్పు డుత్తరమున కేగు♦ననువుమెఱసి
వెడల నవ్విమానము రామ♦విభుఁడు జనక, జాతఁ గని యిట్లు పల్కె సం♦ప్రీతుఁడగుచు.

—: రాముఁడు సీతకు త్రోవలోని చిత్రములఁ జూపుట :—

చ॥ మనము కలంకమాని కను ♦ మా యిది నే మది నెంచినట్టు లం
కను వలగొంచుఁ బోయెడిది ♦ కాంచుము తూరుపు వాకిలిన్ బ్రహ
స్తుని మన నీలుఁ డిచ్చటనె ♦ దోర్బల యుక్తి నడంచి కూల్చె ద
క్కినమున ద్వారమిద్ది పరి ♦ కింపు సుపార్శ్వుఁడు చచ్చె నిచ్చటన్.

చ॥ ఇది పయిదిక్కు వాకి లిట ♦ నింద్రజితుం మన లక్ష్మణుండు పెం
పొదవ వధించె నియ్యదియె ♦ యుత్తర మార్గము రావణుండు బె
ట్టిదముగ బోరు సల్పె యిట ♦ డించె శిరంబులు కేలు లెక్క లే
కెముఁగఁగఁ దున్మి తున్మి మడి♦యించితిఁ దుష్టతుదిం వరాంగినీ! ౧౯౮౦

సీ॥ కపులు వారిధిఁ దాఁటఁ♦గడఁగి చిత్రంబుగాఁ, గట్టిన సేతువు ♦ గాంచు మబల!
తలిదండ్రులకు గురు♦వులకు బంధులకుఁ జే, సిన కీడు దీని ద♦ర్శింపఁ దొలఁగుఁ
దొల్లి యింద్రున కంజి ♦ తోయధిం జొచ్చిన, గంధమాదన మదే♦కంటె సుదతి!
తత్పర్వతంబుతోఁ ♦ దవిలి యీవారధి, పొలుచుటచేఁ బరి ♦ పూతమయ్యె
తే॥ జాహ్నవీ గౌతమీ సర♦స్వతుల సింధు, యమున నర్మద కావేరు♦లందు మునుఁగు
వారి పాపముల్ తొలఁగు న♦వ్విగిది నిందు,మునిఁగి దీనిఁజూచినఁ బాప♦ములు తొలంగు.

సీ॥ పశుహంతకులు పితృ ♦ పంచక హంతలు, పసిబిడ్డలం జంపు ♦ పాప గుణులు
పడఁతుల నఱకిన ♦ పొడువలు తపసులఁ, దొడఁగి హింసించిన ♦ దుండగీండ్రు
శరణార్థులం ద్రుంచు ♦ నఱజాతి పలువలు, వచ్చి భక్తిని సేతు♦ వారి మునుఁగఁ
బాపంబులను వీడి ♦ పరిశుద్ధులై వేల్పు, లగుదురు పడవ లిం ♦ దరుగుకొఱకు
తే॥ వింటికొనచేత వర్ధతెన ♦ విఱుచు చోటఁ, దానమాడిన పంచ పా♦తకము లీఁగి
యిరువదొక్క జన్మంబుల ♦ నింద్రభోగ, ములను పొంది సుఖింతురు ♦ జలజనేత్ర!
తే॥ నిటలనేత్రుని జటయందు♦నిలుచు గంగ, సేతువగు భాగ్యమును నేను♦చెందనైతి
నంచు గొప్ప తపంబు గా♦వించుచున్న, దనిన దీని గౌరవమున♦కలవియున్నె!

క॥ వరుణుం డిట నా పావక, శర వహ్నికి నోర్వలేక ♦ శరణము చొచ్చెం
వరవర్ణిని! కాంచితె క్ర, మ్మఱ దీని నగస్త్యుఁ డుండు ♦ మలయాచలముం.

చ॥ సురుచిరగాత్రి! చూడుమిది ♦ సుందరశైలము విష్ణువాసముం
వరమతి వేంకటాచలము ♦ భక్తిని కాంచుము నీ మనంబు నే
నరసితి వాయుపుత్త్రుఁడు ప్రి ♦ యంబున నం దొలుదొల్తఁ జూచు చో
టరయుము ఋశ్యమూక మిది♦యన్నులమిన్న! మనోహరంబుగం. ౧౯౮౫

తే॥ అమిత బలశాలి శత్రు భ♦యంకరుండు, శూలిభక్తుండు నగు వాలి♦కూలినట్టి
సీమ యిది యది చూడు కి♦ష్కింధ సూర్య, సుతుఁడు పాలించు నగరంబు♦శోభనాంగి.

చ॥ అనుటయు సీత సంతసిలి ♦ యార్య! కపీంద్రులు పెక్కు వెల్లువల్
మన మలరంగ గొప్ప బహు ♦ మానముతోఁ గొలువంగ నుండు ని
న్ననుసృతి సేయు నే నొకతె ♦ నై యరుదెంచుట లెస్సగాదు నీ
యనుఁగులు వారివారి లలి ♦ తాంగులతో నరుదేరఁ గోరెదం. ౧౯౮౮

చ॥ పిలువుఁడి యన్న జానకి య♦భీష్టము రాముఁడు సూర్యసూతితోఁ
దెలుపఁగ నాతఁడుం బిలిచి ♦ తెమ్మని మారుతిఁ గాంచి పల్క నా

బలియుఁడు పూతమానసుఁడు ♦ భావ్యము యంచరు దెంచి వానరీ
కులములఁ దోడి తెచ్చె రఘు ♦ కుంజరు పత్ని మనంబు పొంగఁగన్.

ఉ॥ పావని వెంట వచ్చిన ప్ల ♦ వంగసతుల్ తమ తేనికిన్ ధరి
త్రీ వరపుత్త్రికిన్ రఘు వ ♦ రేణ్యులకుం దగ మ్రొక్కి తాము సం
భావన సేయఁ దెచ్చు శుభ ♦ వస్తువులెల్లను మోలనుంచి సీ
తా వనితా లలామను ము♦దంబునఁ గొల్చుచు నిల్చి రయ్యెడన్ ౧౫౭౯

చ॥ నడచె విమాన మర్కకుల ♦ నాథుఁడు పిమ్మట సీత కిట్లనెన్
మడఁతిరో! కాంచితే భువన ♦ మాన్య జలాన్విత గౌతమీ నదిన్
జడిముడినొంద వంచకపు ♦ జింక కనంబడె నిందె యందు నీ
యెడయిక దాపురింపఁ గృశి ♦ యించితి మత్త గజేంద్ర గామినీ! ౧౫౮౦

చ॥ ఇది తపసుల్ వసించి తపి ♦ యించెడు దండక చిత్రకూట మి
య్యది భరతుఁడు వచ్చి నను ♦ ప్రార్థన సేసిన దిండ ప్రేముడిం
బొదలఁగ నీవు పెంచినవి ♦ పూ లత కూనలు మందహాస సం
పద చెలువొంద శాఖ లను ♦ బాహులతో నిను పిల్చెఁ జూడుమా.

ఉ॥ ఓ జనకేంద్ర పుత్త్రి! కను ♦ ముగ్ర తపోబల శాలియౌ భర
ద్వాజుఁడు శిష్యవర్గము ము ♦ దంబునఁ గొల్వఁ దపంబె రూప ము
త్తేజిత రీతి నొందె ననఁ♦ దేఁకువఁ గేలను దండ కుండికల్
భ్రాజిల వచ్చుచుండె మన ♦ రాక యెఱింగి యెదుర్కొనన్ వడిన్.

—: భరద్వాజుఁడు శ్రీరామాదులకు విందు వెట్టుట :—

తే॥ అనుచుఁ దమ విమానము దిగ ♦ నాజ్ఞయిడఁగ, దేవలోకమే భూమికి♦దిగినవగిది
నిలువ రామచంద్రుఁడు ముని♦నేత కెదురు, చని తదీయాంఘ్రియుగము మ ♦
స్తమునఁ దడవె.

తే॥ వత్సలత తొలఁకఁగ భర♦ద్వాజమౌని, దీవన లొసంగి రాముని♦తివిరి యెత్తి
యలమిశిరము మూర్కొనియశ్రు♦జలము చేతఁ, దోయజాక్షుని జటలలో♦ధూళిఁగడిగె.

తే॥ సీతయును లక్ష్మణుండును♦చేరి కేలు, మోడ్చ నాతండు దీవించి♦ముదము వలన
మనసు కరఁగంగ నమృతంబు♦తనకుదొరకు, చందమున నుబ్బి తా వివ♦శత్వమందె.

తే॥ దనుజపతి వనచరపతి♦తక్కువారు, చేరి చేమోడ్చ వారి నా♦శీర్వదించి
వేద ఘోషంబుతో శిష్య♦వితతితోడఁ, బర్ణశాలకుఁ గొనిపోయె♦వారి నతఁడు.

తే॥ శాస్త్రయుతముగ నతిథి పూ♦జలను సలిపి, శ్రమము పోకార్చి పదపడి♦ప్రవిమలార్క
వంశదీపకు శ్రీరామ♦భద్రుఁ డనివి, సనక మఱిమఱి కని యిట్టు♦లనియెఁ దుదకు.

క॥ మునులు నరులు సుమనసులును, ఘనముగ భీతిల్లఁ గ్రూర♦కర్మంబులు నె
ట్టన సేయు దనుజ కులములఁ, దునిమితి లోకముల మేలు♦తొట్టఁగ రామా!

మ॥ ఖర మారీచ విరాధులన్ వనమునన్ ♦ ఖండించి సాలంబులన్
శరమొక్కంటను తొల్చి యింద్రతనుజుం ♦ జక్కాడి వారాశి దు
ర్భర కోపంబున మాడ్చి రావణుని త ♦ ద్వంశంబు నిర్వంశమై
పరఁగం గూల్చితి వెల్ల లోకములకున్ ♦ బ్రాపింపఁగా శ్రేయముల్.

తే॥ చిత్రకూటంబు వీడి ద♦క్షిణమునందు, గలుగు చెడుగుల నన్నిటిఁ♦దొలఁగఁజేసి
మరలి వచ్చెదు దనుక ని♦న్మఱవలేదు, వచ్చితివి నేఁడు విందవై♦వఱలుమయ్య!

చ॥ కరమున విల్లు దాల్చి జ ♦ గంబుల గాసిలఁజేయు దుష్టులన్
దెఱచితి వెల్ల జీవులకు ♦ సేమము సేకుఱె సర్వదా తపో
నిరతియు నిల్చె మాకుఁ గరు ♦ ణించితి నీశపథంబు చిత్త మా
భరతుని మీఁది వత్సలతఁ♦బర్విడుచున్నది నీకు రాఘవా! ౧౫౯౧

చ॥ అతఁడును మైచెమర్పఁ గను ♦ లందున నశ్రులు రాల వంది ని
శ్చితమతి లేక వేగుటయుఁ ♦ జింతను దక్షిణ దిక్కు చూచుచున్
వితమఱి దుఃఖమే తనువు ♦ వీఁక భజించిన చంద మొంది నీ
కతయె తలంచుచున్ గడె యు ♦ గంబుగఁ ద్రోచెదు నేఁడు రాఘవా!

చ॥ విసుగుచు నింద్రియావళుల ♦ వీఁక నడంచి దినంబుఁ గాయలన్
గసరులఁ దిన్చు సౌఖ్యములఁ ♦ గాంచక కత్తృణ తల్పమందు దా
నినులఁ దొలంచుచున్ సతము ♦ నిన్నె జపించుచు రాజధానికిన్
వసిగొని పోక పల్లియను ♦ వాసము చేయుచునుండు రాఘవా! ౧౫౯౩

క॥ పదితల లిరువది కరములు, విదితంబుగ నేలఁగూల ♦ వింశతి బాహుం
గదనమునఁ గసిమసంగుచుఁ, జదిపిన రఘువీర! నిన్నె ♦ జపియింతు సదా.

క॥ ఆలీల మాని పలుకఁగ, శూలియు వనమాలి తమ్మి ♦ చూలి నుతింపం
జాలిన మీదయచే నేఁ, బోలఁగ ధన్యుండనైతిఁ ♦ బుణ్యచరిత్రా! ౧౫౯౫

మ॥ అని సీతాపతి తెల్ప మానియును రా ♦ మా! నీయభీష్టంబు దీ
ర్పను నాచిత్తము తత్తఱించె నన శ్రీ ♦ రాముండు కీశవ్రజం
బునకున్ మీవనమందు కాయ గసరుల్ ♦ పుష్పాసవంబుల్ జలం
బును నిండారఁగ నుండుఁగాక యన నా ♦ పుణ్యుండు సంతుష్టుఁడై.

శా॥ కాకుత్స్థాన్వయ! నీకు నీహితులకుం ♦ గావింతు సేవిందు నేఁ
డీ కాంతారము దేవలోకమగు నా ♦ యిష్టంబు నందిల్ల న
స్తోకప్రేమను పొందుఁ డంచొక హవి♦స్సున్ వేల్వఁగాఁ గన్ననన్
నాకం బచ్చటి కేగుదెంచెఁ గపులా♦నందంబునం బొందఁగన్. ౧౫౯౬

శా॥ సుగ్రీవాదులకుఁ మహేంద్ర విభవ ♦ స్తోమంబు నిండార నూ
ర్వ్యగ్రీయాన్వయ మండనాకృతికి రా ♦ జాన్నంబు చేకూర్ప న
వ్యగ్రుండై రఘురామ భూపుఁడు జగ ♦ త్ప్రాణాత్మజుం గాంచి నం
దిగ్రామంబున కీవు మున్నుచని మ ♦ ద్వృత్తాంతముం దెల్పుచుఁ.

చ॥ భరతుని శీలముఁ దలఁచు ♦ భావములెల్లను పోలఁగాంచి చె
చ్చెరఁ జనుదెంచు టెన్నఁగ వి ♦ శిష్ట పథంబగుఁ బోయి రమ్మనఁ
నరియని మారుతాత్మజుఁడు ♦ చయ్యన వాయుపథంబునందు తం
డిరి వడి చిత్తవేగమును ♦ డిందుపడం జని పోవు త్రోవలో. ౧౫౯౯

తే॥ గుహుని గని రాము సేమము ♦ గోర్కెఁ దెల్పి, యవలికేగెను రాఘవుఁ ♦ డసురవధము
సేయుపద్ధతిఁ గంటిమి ♦ చిత్తమలర, భరతు వర్తనఁ గందమీ ♦ పట్టునందు. ౧౬౦౦

—: భరతుఁడు రాముని రామికిఁ బరితపించుట :—

సీ॥ ప్రతిదినంబును రామ ♦ పాదుక లర్చించి, యింద్రియంబు లడంచి ♦ యొరఁగువాఁడు
అన్నిచోటులఁ గల ♦ యనుకంప యొకచోటఁ, బూర్ణరూపము గొన్న ♦ పోల్కివాఁడు
కలిగియు నొల్లక ♦ కాంతార వాసుల, యోరెమే భుజియించు ♦ చుండువాఁడు
చూచిన వెతతోడఁ ♦ జూచు దక్షిణదిక్కు, గాక వేఱొక దెస ♦ గననివాఁడు

తే॥ అన్న వాక్కు లెన్నటికస ♦ త్యములుగావు, వచ్చునని జీవముల నిల్పి ♦ వలచువాఁడు
కుడుచు నీటికి జీవాత్మ ♦ కును నిజంబు, జీవ మా రాముఁడని చింత ♦ సేయువాఁడు.

తే॥ రామ పట్టాభిషేక నీ ♦ రంబు గాంచి, కాక బాష్పవాహిని దరి ♦ గాంచలేని
భరతుఁ డానాఁడు జానకీ ♦ వరుఁడు వచ్చు, దినముఁ గూర్చి యాలోచింపఁ ♦ దివిరినాఁడు

తే॥ తాను లెక్కించు లెక్కలోఁ ♦ దప్పుగలదో, యనుచు గణకులఁ బిలిపించి ♦ యడుగ వారు
తీఱు నేఁటితో వనవాస ♦ దీక్ష యనుచుఁ, బలుక భరతుఁడు మనమున ♦ భయము చెంది.

క॥ సంపద్భోగంబుల మది, నుంపని పుణ్యుండు నొచ్చి ♦ యుమ్మలికముతోఁ
గంపముతో ననుకంప జ, నింపఁగ నిట్టూర్చి తుదకు ♦ నేలఁ వ్రాలెఁ.

శా॥ నామీఁదం గృపగల్గునో కలుగదో ♦ నాయార్తి లెక్కింపవో
నామాటల్ మదినుంతువో యునుపవో ♦ నాకీడు మన్నింపవో
నామోముం దిలకింపఁగాఁ దలఁపవో ♦ నాచిత్తముం గానవో
ప్రేమం దల్లులనైనఁ గాంచుటకు రా ♦ వే సత్కృపం జూపవే? ౧౬౦౧

శా॥ నాదౌర్భాగ్యము చేత నీకు నటవిఁ ♦ దాపించిరే శాత్రవుల్?
నీదాయల్ హరి శంభులైన ననిలో ♦ నిల్వంగనే నోర్తురే?
కాదే నింకను కొన్నియేండ్లు భరత ♦ క్ష్మాపాలుఁడే రాజ్యముఁ
మోదంబారఁగ నేలనిమ్మనుచు నా ♦ మోదించితే? యగ్రజా!

చ॥ అడవిని యుండుగాక మరి ♦ యాద నయోధ్యకె వత్తుగాక నీ
యెడఁద యదెట్టులుండె నటు ♦ లే జరపింతువుగాక యేదియున్
దడవక నాప్రతిజ్ఞ ఫల ♦ దంబు నొనర్చుటె నాకుఁ గర్జమా
విడిచెద నగ్నిలోనఁ బరి ♦ వేదన దీఱ మదీయ జీవముల్. ౧౬౦౯

మ॥ అనుజన్మా! యిటురమ్ము చేరువకు ని ♦ న్నర్థింతు నొక్కండు నీ
వనుకంపంగొని యీ వరంబు దయచే ♦ యన్ వేఁడెదన్ రామచం
ద్రుని యేవార్తయు వీనులం బడదు నా ♦ దుష్కర్మ సంప్రాప్తి న
గ్నిని నేఁజొచ్చెద నన్న వచ్చుదనుకన్ ♦ వీక్షింపు మీరాజ్యమున్.

మ॥ అన శత్రుఘ్నుఁడు విహ్వలించుచు హలా ♦ హాలంబు భక్షించు వి
న్ననువుం దోఁప వడంకి నేలఁబడి య ♦ న్నా! యేమి దోసంబు నీ
కొనరింపం దలపెట్టినాఁడ? మది ని ♦ ట్లూహింపఁగాఁ బోలునే?
నను శిక్షింపఁ దలంచితేల? యిదియున్ ♦ నాచేయు దుష్కర్మమో?

చ॥ జనకుని సత్యవాక్యునిగఁ ♦ జల్పఁగ నన్న వనిం జొరంగ నే
వన మొనరింపఁ గానలకు ♦ బ్రాఁతిగఁ దమ్ముఁడొకండు పోవ రా
ముని పునరాగమావధియుఁ ♦ బోవఁగఁ దమ్ముఁ డొకండు జీవముల్
తనకఁగ వీడుచుండఁ గడ ♦ తమ్ముఁడు రాజ్యము సేయుఁ జెల్లరే? ౧౬౧౦

చ॥ అడవుల నన్నయుండఁ బుర ♦ మందలి భోగములందెఁ దమ్ముఁడన్
నుడి జగమాడునంచు మది ♦ నొచ్చి తపించుచునుండి యగ్నిలోఁ
బడుచును పిన్నతమ్ముఁ డొద ♦ వంగలఁడంచుఁ దలంతుకాక యీ
యెడరు సహించి యేబ్రదికి ♦ యేలఁగఁబోలునె యీ ధరాస్థలిన్? ౧౬౧౧

శా॥ శత్రుఘ్నుం డిటు పల్కఁగా భరతుఁ డి ♦ చ్చ న్నొచ్చి యట్లైన నే
ధాత్రిం బాలన సేయుచుంటి నని కా ♦ దా రామభద్రుండు తా
నీ త్రొక్కాటము గూర్చుచుం దడసె వ ♦ హ్నిం జొచ్చి యే నీల్గుచోఁ
బుత్రప్రేమను కావవచ్చు జనమున్ ♦ బుణ్యాత్మ! నిప్పుంపవే. ౧౬౧౨

—: కౌసల్య భరతు సమాధానపఱచుట :—

మ॥ భరతుం డిట్లు వచించు వార్త వడిగాఁ ♦ బ్రాఁకన్ జనంబెల్లఁ ద
త్తఱపాటొందెఁ బతివ్రతామణి కృపా ♦ ధౌరేయ కౌసల్య దు
స్తర తాపంబున సాహసంబు వలదో ♦ తండ్రీ! జగంబెల్ల ని
ర్భర దుఃఖంబునఁ గ్రుంగి కూలు ననుచున్ ♦ వచ్చెన్ విచారంబునన్.

చ॥ తలముడి వీడ మేన్వడఁకఁ ♦ దత్తఱపాటున వచ్చు తల్లి న
య్యలఘుఁడు కాంచి యామె చర ♦ ణాంబుజముల్ తలసోఁక మ్రొక్కఁగాఁ

దలియుఁ గుమారు శీర్షమును ♦ తక్కక యక్కునఁ జేర్చి నాయనా!
వలదిటు సాహసంబు మము ♦ వారక కాచు సుతుండ వీవెకా! ౧౬౧౪

ఉ॥ నీ జనకుం డొనర్చినది ♦ నీ పెదయన్న వనంబు చేరుటల్
నాజగజంపు దుష్కృతగ ♦ ణంబు ఫలంబగుఁ గ్రమ్మఱిల్లమిన్
నాజనన ప్రభావమగు ♦ నాయన! నీదొసఁగేది యిందు? నీ
వీ జగ మీ విధాన నశి ♦ యింపఁగఁ జేయుట యుక్త కార్యమే? ౧౬౪౧

ఉ॥ నీవగినిం జొరం దలరి ♦ నీప్రజయుం బడు సేనయుం బడున్
జావక మేము నిల్తుమొకో? చానలు మమ్ముల వెంబడింపరే?
చావదె ధర్మమున్? జగము ♦ సర్వము కూలదె వీటతాటమై?
యీవిధి పాపకర్మమని ♦ యెంచవొ? యేమి తలంచి తిమ్యోడన్? ౧౬౧౬

చ॥ ధర్మయుతంబులై తనరు ♦ దద్దయు నీపను లెల్లకాలమున్
ధర్మ విహీనపద్ధతిని ♦ తారుట గానమ యెన్నడేని నీ
ధర్మ గురుత్వ సంపదలఁ ♦ దక్కక నీవెఱుఁగంగ లేదు నీ
శర్మద సత్త్వధర్మములు ♦ శాశ్వతముల్ యుగపాళి మాఱినన్. ౧౬౧౭

ఉ॥ ఉత్తమ పుత్త్ర! రామవిభు ♦ లోక్కటఁ బెక్కగు కోట్లు కూడినన్
బొత్తిగ నిన్ను ప్రేమమయుఁ ♦ బోలఁగఁ జాలుదురేమి? పుణ్యమే
యిత్తగ రూపమొందిన ర ♦ హిన్ వహియించిన నీవు వోవఁగా
రుత్తమె కాదె ప్రాణి నికు ♦ రుంబముతోడ నజాండ మియ్యోడన్. ౧౬౧౮

ఆ॥ మాపు రాకయున్న ♦ రేపె రాఁగలఁడు నా, తలఁపు పొల్లుగాదు ♦ తప్పనేని
రామవిభున కేదొ ♦ రారాని యెడరు ప్రా, ప్తించె నంచు నెడఁద ♦ నెంచవచ్చు.

తే॥ నీవె శాస్త్రధర్మంబులు ♦ నీవుతక్క, శాస్త్రధర్మంబు లొకఁడైన ♦ జగతి లేదు
ఒకఁడు మరణించె నని యెంచి ♦ యుర్వినున్న, ప్రాణికోటులఁ జంపఁ బొ ♦ ల్పడఁగఁదగునె?

ఉ॥ ఉర్విని చావు పుట్టుకలు ♦ యోగ వియోగములున్ సుఖాదులున్
సర్వము కర్మజాల ఫల ♦ సంభవమౌటఁ దలంచి సాత్త్వికుల్
గర్వము మోహమున్ వదలి ♦ కాంతురు నిశ్చల సౌఖ్యమంచుఁ దా
నిర్వృతి గూర్చు రామ జన ♦ నిం గని కైక కుమారుఁ డిట్లనున్. ౧౬౨౧

తే॥ రాము సత్య వాక్యము దిన ♦ రాజవంశ, శీలమును చెడ జీవింపఁ ♦ జాల నాదు
ప్రతిన నెఱవేర్చుకొందు నీ ♦ పలుకు వినని, దొసఁగుక్షమియింపు మమ్మరో! ♦ విసుగుగొనక.

ఉ॥ ఏనును సత్యపాలనకు ♦ నిమ్ముగ జీవము వీడు జేనికిన్
నూనుఁడనే కదా! జనకు ♦ నూక్తుల నొదలఁ దాల్చుచెన్నఁగా
జానకిజానికే విధియొ? ♦ జానుగఁ దక్కినవారి కుర్వరన్
బూనిక నెగ్గఁ జేసికొనఁ ♦ బోలదొ? యెక్కడి పాడి? తల్లిరో! ౧౬౨౩

ఉ॥ తల్లి వచస్సు మీఱమియుఁ ♦ దండ్రి నుడుల్ జవదాటకుండుటల్
పెల్లుగ నింపఁ బాత్రమగు ♦ ప్రేమ సమూలముగాఁగఁ ద్రుంచుటల్
చెల్లిన దొక్క రామునకె ♦ చెల్లదు నాకది చచ్చి నామదిన్
వెల్లడి చేసెదన్ గలుమ ♦ బృందముఁ బాసెదఁ జూడుఁ డిందఱున్.

—: హనుమంతుఁడు భరతుని చేరుట :—

చ॥ అని భరతుండు చేరఁజని ♦ యగ్నిఁ బ్రదక్షిణ మాచరింపఁగా
జనముల గోడు క్రందుకొని ♦ చయ్యన వ్యోమము ముట్టె నా ఘన
స్వనముల నాలకించి రభ ♦ సంబునఁ గార్యము మించెనంచు న
య్యనిల సుతుండు తత్తఱము ♦ నందుచు డాసె మహోగ్ర వేగుఁడై.

ఉ॥ డాయుచు రామచంద్రుఁడు క ♦ డంకను వచ్చుచు నున్నవాఁడు న
త్యాయతనంబ యైన భవ ♦ దాయువు వోయెనయేని రాఘవుం
డీయిల నవ్వలం బ్రదుక ♦ నీకొనునే? యని పల్కి తూఱి యం
దాయితమైన యగ్గి నతఁ ♦ డాఱిచి బొగ్గులు చేసె వేల్మిడిన్. ౧౬_౨౬

చ॥ పదపడి వచ్చి యాభరతు ♦ పాద సరోజయుగంబు భక్తి నె
న్నుదురు స్పృశింప మ్రొక్కుచు న ♦ నుం బరిపూత చరిత్ర! దాసుఁగా
మదిఁ దలఁపందగున్ సుజన ♦ మాన్యుని రాముని రాక కెన్న న
ల్వది గడె లింక నున్నయవి ♦ వారక మీరు గణించి చూడుఁడీ.

శా॥ నా వాక్యంబుల యందసత్య మది యు ♦ న్నన్ మీకు నే ముందుగా
నీ వహ్నింబడి కూలువాఁడ ధరజా ♦ త్మేశుం డిదో వచ్చెఁ బ్రొ
ద్దావర్తించి జనించుదాఁక నిలుమా ♦ యామీఁద రాఁడేని నీ
వీ వైశ్వానరులోనఁ జేరుము మనో ♦ భీష్ట ప్రకారంబునన్. ౧౬_౨౮

తే॥ వచ్చుచోఁ బ్రేమమున భర ♦ ద్వాజమౌని, నిలిపి విందువెట్టఁగ వేఁడ ♦ నిలిచినాఁడు
తామసింపఁడు నీమీఁది ♦ తత్పరతను, నీరజాక్షుండు నంశీల ♦ నిరత! భరత! ౧౬_౨౯

—: భరతుఁడు రాముని రాక విని యానందించుట :— [జూపఁ

తే॥ అతఁడు ప్రేమతోఁ బంపిన ♦ యానవాలు, కలదు చూడుమా యనుచు నుం ♦ గరముఁ
గాంచినంత నయ్యది వారి ♦ కనులఁ జొచ్చి, ప్రాణముల నిల్పె నమృతంబు ♦ పగిదినొప్పి.

తే॥ రోదనము వోయి యానంద ♦ రుతము చెలఁగె, వేఁడి కన్నీరు చల్లనై ♦ వెడలసాఁగె
వ్రాలియుండిన తలలెల్లఁ ♦ బైకిలేచెఁ, జేతులెల్లను హనుమ నా ♦ శీర్వదించె. ౧౬_౩౧

క॥ పలుమాఱు హనుమకు మ్రొక్కుచుఁ, జెలఁగి నటనసేయు సుగుణ ♦ శీలుఁడు భరతుం
డలఘుని ముద్రిక నక్కున, నలమెఁ గనుల నద్దికొని ము ♦ దానందించెన్. ౧౬_౩౨

తే॥ వేఱుదుగఖంబులేనట్టి♦విమలగుణుఁడు, భరతుఁడపుడునిక్కముగ్రొత్త♦భరతుఁడయ్యె
భుజము లుప్పొంగె మేనును♦బూరటిల్లె, నతని యానంద మదిచెప్ప♦నలవియగునె?

తే॥ నలువుగాఁ బ్రేమ మధికమై♦నవ్వు నేడ్చు, నిక్కు గంతులు వైచును♦నేలఁబడును
చేష్టదక్కఁ బూరించును♦చెమ్మరించు, మలసి తిరుగు మారుతికి న♦మస్కరించు.

క॥ ఆడుం డాడుఁడు రాముని, గూడుఁడు కూడుండి యతని♦గొమరగు కీర్తిం
బాడుఁడు పాడుఁడు వెతలను, వీడుఁడు వీడుండి యితని♦వినుతింపుఁడనున్. ౧౬౩౭

తే॥ కఠినమానస యగు కైక♦కడుపునొచ్చు, ననుచుఁ బెద్దలకున్ మ్రొక్కు♦నవనిపులకు
మ్రొక్కుఁ జెలువలకును మ్రొక్కు♦మ్రొక్కికొనును, పృథివిఁ గల్లువంటిదె
నుమా ♦ ప్రేమగుణము. ౧౬౩౮

తే॥పిదప భరతుండు హనుమంతుఁ♦బ్రీతిఁగాంచి, యెవ్వఁడవు తెల్పుమా విన♦నిచ్ఛగింతు
విప్రవేషంబుతో వచ్చు♦విబుధపతివో?, ముగురు మూర్తుల నొకఁడవై♦తగుదువనిన.

చ॥ అతనికి నాంజనేయుఁ డను ♦ నంజనిపుత్త్రుఁడ వానరుండ మా
రుతిని దినేంద్రనందనుని ♦ రూఢిగఁ గొల్చుచునుండు జానకీ
పతికి హితంబు జీతమును ♦ బత్తెము గోరక కూర్చు దానుఁడన్
నుతగుణపూర్ణ! నీకడ క ♦ నుంగున వచ్చితిఁ గామరూపినై. ౧౬౩౯

క॥ నాయల్పరూపమును నీ, వీయెడఁ గన నిచ్ఛగింతు ♦ వే యని మార్చెన్
కోయని నిర్జరు లార్వన్, భీయును మోదంబు నెడఁద♦వికవికనేయన్. ౧౬౩౯

తే॥ పవనసూనుని దొడ్డరూ♦పంబుగాంచి, భరత శత్రుఘ్నులతి మాత్ర♦బద్ధమనిరి
సకల జనములు సుడివడి♦చావకున్న, దిగ్భ్రమం జెంది పెల్లు భీ♦తిల్లినారు. ౧౬౪౦

తే॥ వాయుపుత్త్రక! మేమాడు♦వాక్కులెల్ల, నీచెవుల కందునంతటి♦నిన్వనంబు
కలవి కావు కావునఁ దొల్లి♦కరణి నిలిచి, నీ మహా రూప మడఁపుము♦నియతచరిత!

తే॥ అనుచుఁ బ్రార్థింపఁ దనవేడ్క♦ననుసరించి, పిన్నరూపంబు గైకొన్న♦విబుధనుతున
కమిత సంపదలను భూష♦ణాంబరముల, నుపదగాఁ గైకపుత్త్రకుఁ♦డొసఁగెఁ బ్రీతి.

తే॥ మత్త గజము లుత్తమజాతి♦మణులు తురగ, చయములును పాఁడి గోవులు ♦
స్యందనములు
మంచి కేదారములను స♦మ్మాన పూర్వ, కముగ నొసఁగెను హనుమకుఁ♦గైకసుతుఁడు.

తే॥ తమ్ము నీక్షించి మన పౌర♦తతికి నెల్ల, రామవిభు నెదుర్కొన బంధు♦రాజితోడ
బయలుదేఱుఁడియనియన్ని♦వాడలందు, తెలియఁజాటింపఁజేయుము♦తెఱఁగుఁగాఁగ.

తే॥ తోరణములు గట్టించి వీ♦థుల నలంక, రింప రథగజాశ్వంబుల♦రీతిగాఁగఁ
బొలుపు సేయింప మంగళ♦పూర్ణకుంభ, ములను పెట్టింప వలయు వా♦రలను పనుపు.

తే॥ క్రమముగా భరద్వాజునా♦శ్రమమువఱకు, ముత్తెములపందిరులమర్చి♦పురము నెల్లఁ
గ్రొత్తదగునట్లు సేయించి♦కొమరు మీఱ, మంగళారావములను చె♦లంగఁ జేయు॥

తే॥ అనుడు శత్రుఘ్నుఁ డప్పుడ ♦ యరుగు దెంచి, శుద్ధగుణయుతుఁడును బహు ♦ శ్రుతుఁడు హితుఁడు
మంత్రియును ప్రాజ్ఞుడైనను♦మంత్రుఁ గాంచి, భరతునాజ్ఞను వివరించె♦బంధురముగ॥

సీ॥ ఆవార్త చెవిఁజొచ్చి♦నంత సుమంత్రుఁ డ, త్యానందమునఁ దన్ను♦తాన మఱచి
భేరులు మ్రోగించి ♦ వీథివీథికిఁ జని, కకుబంత విశ్రాంత♦కలిత కీర్తి
రావణ సమవర్తి♦రామమూర్తికి నెదు, ర్కోలు సేయఁగ రాచ♦కొమరులు బల
వితతులు పురజనుల్♦వేడ్కతోఁ గ్రై సేసి, కొసి రండనుచు మీరు♦ఘోషణంబు

తే॥ సేసి రండని కింకర♦శ్రేణి నంప, వారు చాటించి రంత న♦ప్పలుకు విన్న
ప్రజలు కోలాహలము సేయఁ♦బత్తనంబు, పూర్ణ చంద్రోదయాంబుధి♦పోలువునొందె॥

సీ॥ రాము నెదుర్కొన♦రండను చాటింపు, పేదకుఁ బెన్నిధి♦విధమ యయ్యె
రాముపెండ్లికి మున్ను♦రండని చాటించు, కరణి నొప్పారెను♦మురజ రవము
అఱువదివేల య♦క్షౌహిణుల బలంబుఁ, బౌరకాంతామణుల్♦పౌరవరులు
రాజకుమారులు♦ప్రార్థించు సంపద, యొప్పారైన చందాన♦ముదమునొంది

తే॥ పొదలి నడచిరి తల్లులు♦ముగురు పసిఁడి, శిబికలందెక్కి వెడలిరి♦శిష్టజనులు
బంధువులు పరివేష్టింప♦భరతరాజు, లీలగా హనుమంతుని♦కేలువట్టి. ౧౬౪౯

తే॥ రామభద్రుదు పాదుకలు శి♦ర్షకములుగాఁగ, నిరుగెలంకులఁ బైఁడిచా♦మరలు వీవ
గజఘటలు మున్నుగా నేగఁ♦గలితపాండు, రాతపత్రంబు నీడలో♦నరుగుదెంచె.

మ॥ కృప మమ్మేలిన రామచంద్రు నెదురం ♦ గేల్వట్టి సామీరితో
నృప సంపూజ్యుఁడు పాదచారియయి తా ♦ నేతెంచుచున్నాఁడు వ
చ్చు పథంబందున రాలు వేఁడిగొని కా ♦ ల్చుం గోమలాంఘ్రి ద్వయం
బపచారంబని దాఁటెనో యన నినుం♦డస్త్రాద్రిఁ జేరెన్ వెసన్. ౧౬౫౧

—: భరతున కాంజనేయుఁడు రాము నుదంతంబు దెల్పుట :—

తే॥ భరతుఁ డయ్యెడ మారుతి♦వదనము గని, రామచంద్రుఁ డిన్నాళ్లు గా♦రవముతోడ
నెచ్చటెచ్చట నుండె? నే♦మేమిచేసె?, వివరముగఁ దెల్పవే యన♦వినిచె నతఁడు.

తే॥ పురమునందుండుటయుఁ దల్లి♦వరములవలన, వనుల కేగుటయును నీవు♦వచ్చి యతని
వేఁడి పాదుకలం గొని♦వెడలుటయును, తెలుప నేటికి కవ్వలి కత♦దెలుపువాఁడ.

ఉ॥ దండకయందు చేర ముని ♦ తండము రాక్షస హింసఁ దెల్పి నీ
యండను చేరినార మిఁక ♦ నాపద దీరిచి కావుమన్నఁ గో

దండధరుండు రాక్షస వ ♦ ధం బొనరించె దశాస్యుఁగూల్చె ను
ద్దండ పరాక్రమంబున య ♦ థావిధిఁ దెల్పెద నాలకింపుమా. ౧౬౫౪

చ॥ తన యునికిన్ గ్రహించి రిపుఁ ♦ దప్పక పౌరులు మాటిమాటికిం
బనుపడ వచ్చివచ్చి తన ♦ భావము మార్చెదరంచు దండకా
వనమును చేరుచోఁ జెనక ♦ వచ్చు విరాధుని గూల్చి యవ్వలన్
దనుజులఁ గూల్ప మానులకుఁ ♦ దా నభయం బొసఁగెన్ మహాత్మకా!

మ॥ పదియేం డచ్చటనుండి రాఘవుఁడు త ♦ ద్వాక్యప్రకారంబుగా
నుదధిం ద్రావు నగస్త్యుఁ జూడఁ జని యా ♦ యుత్కృష్ట దేవర్షి కాం
క్ష దలిర్పంగ ముకుందు కార్ముకము న ♦ క్షయ్యంపుఁ దూణీరముం
బ్రదరంబుల్ తరవారి బొందడము గా♦రంబార నీయం గొనెన్. ౧౬౫౬

మ॥ అవలన్ వారు జటాయువుం గలిసి నె ♦ య్యంబార సేవించి పం
చవటిం జేరి కుటీరమందు దినము ♦ ల్సాగించుచుండంగ దా
నవి యొక్కర్తుక చుప్పనాక యెదురై ♦ నారీమణిన్ జానకిన్
దవదాహంబును బోలె ముట్టి కొని పోఁ ♦ దర్కింప సౌమిత్రియున్.

మ॥ కని యా రక్కసి కర్ణనాసికలు లోగిన్ ♦ ఖండింప నాదైత్యయుం
గినుకం బోయి ఖరాదులం గలిసి యా ♦ కీడ్పాటు దెల్పంగఁ ద
ద్దనుజుల్ కోప సమేతులై బలముతో ♦ దర్పించి శ్రీరామచం
ద్రునితోఁ గయ్యముసేసి మాఁడి రగినిం ♦ దూదింబలెం గ్రచ్చఱన్.

శా॥ లంకాద్వీపము చేరి శూర్పణఖ పౌల ♦ స్త్యున్ సమీపించి తా
నంకెం బొందిన పద్ధతిం దెలిపి మీ ♦ నాంకధ్వజంబో యనం
బొంకం బారు విదేహకన్య చెలువం ♦ బుం దెల్పి ప్రేరేఁపఁగా
లంకేశుండును వచ్చె సీతఁ గొని పో ♦ లంకించి మారీచుతో. ౧౬౫౯

శా॥ మారీచున్ హరిణంబుగాఁ బనిపి తా ♦ మాసేంద్రవేషంబుతో
శ్రీరామాంగన యున్నభూమిని పెక ♦ ల్చెం దేరిపైఁ బెట్టె నా
దారిం బోవఁగనీక యడ్డు విహగేం ♦ ద్రస్వామిఁ జక్కాడె లం
కారాజ్యంబునఁ గార నుంచె జనక ♦ క్ష్మాపాల కన్యామణిన్. ౧౬౬౦

మ॥ ఎలయింపం గమకించి దవ్వులకుఁ ద ♦ న్నీడ్పించు మారీచు రా
ట్కుల సింహుండగు రాఘవుండు విశిఖ ♦ క్రూరాహతిం గూల్చి య
వ్వల వైదేహిని రోయుచున్ జనకుఁడౌ ♦ పక్షీంద్రు వీక్షించి కొం
దలపాటొంది నమాచరించె వడి నౌర్ధ్వ ప్రక్రియల్ భక్తిమై. ౧౬౬౧

సీ॥ పదపడి సీతను♦వెదకుచు దక్షిణ, దిశ కేగుదెంచుచుఁ♦దివిరి పట్టు
వికృత రూపుఁ గబంధు♦వికటశాపము మాన్పి, శబరి చేసిన యుప♦చారములను

[ప్రేమను గైకొని♦యామె తెల్పిన త్రోవ, నిన సుతుఁ జేరి స్నే♦హించి వాలి
వలనఁ గల్గిన దుఃఖ♦ములఁ దీర్తునని యభ, యము దయచేసి సా♦లములఁ గూల్చి

తే॥ వాలి వక్షంబు భేదించి♦ప్లవగ రాజ్య, మును దినేంద్రసూతికిఁ బ్రేమ♦మున నొసంగి
వానకాలంబు కడచు న♦వ్వాలసుతోడు, వడఁగ రమ్మనిపంపె న♦బ్జాభసుతుని.

సీ॥ గజుఁడును గవయుండు♦గంధమాదనుఁడును, పనసుండు నీలుండు♦వాలిసుతుఁడు
శరభుండు ఋషభుండు♦శతబలి మైందుండు, ద్వివిద జాంబవదాది♦వీరవరులు
డెబ్బది వెల్లువల్♦ప్రబ్బిన సేనతో, వానకాలము దాఁటఁ♦బ్లవగ విభుఁడు
వచ్చి యచ్చట నన్ని♦వలఁకుల సీతను, వెదకు పద్ధతులను♦విశదపఱచి

తే॥ నాల్గుభాగము ల్గాఁగ సై♦న్యంబుచేసి, యొక్కొక విభాగ మొక్కొక♦దిక్కు వెదకి
వడిగ నెలలోనఁ గ్రమ్మఱి♦వచ్చునట్లు, కఠిన శాసన మొనరించి♦కడఁక నంపె.

ఉ॥ అంగద జాంబవంతులు ర ♦ యంబున దక్షిణదిక్కు చేరి న
న్నంగనఁ గాంచి రమ్మనఁగ ♦ నంబుధి దాఁటితి లంకఁ జేరితిన్
రంగుగ సీతఁగాంచి రఘు ♦ రాముని వార్తల విన్నవించి యా
సంగతి రామచంద్రునకుఁ ♦ జక్కఁగఁ దెల్పితి నంత నందఱున్. ౧౬౬౪

ఉ॥ దక్షిణవార్ధిఁ జేరుతఱిఁ ♦ దక్కక రాముని శౌర్యసంపదల్
రాక్షసరాజుతోఁ దెలిపి ♦ రామునికాంతను వీడకున్న నీ
యక్షయ లక్ష్మి నాశమగు ♦ నన్న విభీషణుఁ దిట్టి దానవా
ధ్యక్షుఁడు వెళ్లఁగొట్ట నతఁ ♦ డార్యుని జేరఁగవచ్చెఁ బ్రీతిమై. ౧౬౬౫

శా॥ కాకుత్స్థుం డభయం బొసంగి వెస లం ♦ కారాజ్య మవ్వేళనే
వీఁకం బట్టము గట్టి శాంతియుతుఁడై ♦ వీరుండు ప్రార్థింపఁగా
నాకర్ణింపమి రోషభీషణ ముఖుం ♦ డై చూడ సప్తాంబుధుల్
చీకాకై జలమింకి మాఁడెను సుర ♦ శ్రేష్ఠుల్ విశోకొందఁగన్. ౧౬౬౬

ఆ॥ శరణు శరణమంచు♦వరుణుండు ప్రార్థించెఁ, దరులు గిరులు ప్లవగ♦వరులుదెచ్చి
వనధిఁబూడ్చి దనుజ♦వరుని లంకనుఁ జుట్టి, చేసినారు వీర♦సింహరవము. ౧౬౬౭

శా॥ కైలాసంబుఁ బెకల్చు బాహువులు ది ♦ క్సారంగ శృంగంబు లా
భీల ప్రక్రియ నాటినట్టి యురముల్ ♦ వీకైన శీర్షంబులున్
లీల న్నేలకు వ్రాల్చి వాని యనుజున్ ♦ వేఁటాడి రాముండు ని
ర్మూలించెన్ దనుజాన్వయంబు ప్రమదం ♦ బుం బొంద బృందారకుల్.

ఆ॥ దనుజ యువక వరులు♦దనుజేంద్ర సుతులును, లక్ష్మశాస్త్రములకు♦లక్ష్యమైరి
సంగరాంగణంబు♦శవమయమయ్యెను, సురలు మునులు ముదము♦చోద్యమంద.

ఆ॥ అమర సిద్ధ సాధ్య♦యక్ష గంధర్వాదు, లెలమి సతులతోడ♦నిలకు వచ్చి
వినతి నిలిచి బహుళ♦వినుతులు చేసిరి, తొలఁగె లోకములకు♦దొసఁగు లనుచు,

చ॥ అమరఁగ రావణాదులకు ♦ నంతిమకార్యములెల్ల సద్విధి
క్రమమునఁ జల్పుమం చసుర ♦ కాంతు విభీషణు నంపి జానకీ
రమణిని గోపగించి యెదు ♦ రన్ శుచినిల్పి పరీక్షచేసి శాం
తము వహియించె రాఘవుఁడు ♦ ధాతృమహేంద్రులు సంస్తుతింపఁగన్.

చ॥ అనదృశ సత్యవాక్యుఁడగు ♦ నాజి విమానమునందు వచ్చి సం
తసమున మ్రొక్కు సూనులను ♦ తత్పరతన్ బిగి కౌఁగిలించి మె
చ్చి సడలు మోదవారి నభి ♦ షేకముచేసి విదేహకన్యకన్
గొసరని ప్రేమతోడఁ గయి ♦ గొమ్మన రాముఁడు సమ్మతించుచున్.

ఉ॥ పెంచిన తల్లి కైకయుఁ ♦ బేరిమి నామె కుమారుపైని ము
న్నుంచిన నిష్కళంక లస ♦ దుత్కట భావము నుంచ వేఁడెదన్
గొంచక యీవరమ్ము నొసఁ ♦ గూర్పుమ యన్న నొసంగి సత్యస
త్కాంచితమూర్తి మీజనకుఁ ♦ డాదటఁ జేరె ముకుందలోకమున్. ౧౬౨౩

చ॥ పదపడి వేల్పులున్ మనసు ♦ పాఱిన పెక్కువరంబులీయ డె
బ్బదియగు వెల్లువల్ దనుజ ♦ బంధులు రాక్షస వీరనాథు ల
ర్వది యగు నేడుకోటు లల ♦ రంగ విభీషణుఁ డిచ్చెఁ బుష్పకం
బదియచుమీ వియత్పథము ♦ నందు జవంబున వచ్చుచుండెడిన్. ౧౬౨౪

ఆ॥ నెమ్మి రాఘవుండు ♦ నిన్ను దలంచుచుఁ, దమ్ముతోడ జనక ♦ తనయతోడ
సకల హితులతోడఁ ♦ జని భరద్వాజుని, యాశ్రమ స్థలంబు ♦ నందు చేర.

తే॥ అతఁ డాతిథ్య మీయంగ ♦ ననువుపఱుప, నిన్నుగాంచి యీముద్రిక ♦ నీకుఁ జూపి
యూఱడింపంగ నన్నంపె ♦ నురవడి మెయి, రామచరిత మిత్యాది మహా ♦ రాజ తిలక!

మ॥ భరతుండంతయు సావధానమతియై ♦ పాటించి యాలించి ని
ర్భర మోహాద్భుత సంభ్రమంబు లెద నా ♦ రం గూరి మల్లాడ నా
దర పాత్రుండయి యొక్కతమ్ముఁడు సమి ♦ ద్ధాత్రిన్ సహాయుండుగా
వరసాహ్యంబు వినంగనోచితిని దౌ ♦ ర్భాగ్యుండ నేనియ్యెడన్. ౧౬౨౫

ఆ॥ అనుచుఁ బలికి భరతుఁ ♦ డధిక నిర్వేదంబు, తోడఁ గాలినడక ♦ తోడ హనుమ
తోడ నడచిచేరెఁ ♦ దోయజాప్తుఁడు తొలి, గట్టు నెక్కుమున్నె ♦ గంగ కడకు.

శా॥ ఘోరాకారుల రావణాదులను బ్రె ♦ క్కోల్చేసి యుద్యజ్జయ
శ్రీరాజిల్లఁగ రాఘవుండు నగరిన్ ♦ శ్రీదేవి భూదేవి త
న్నారాధింప మహాభిషిక్తుఁడగు నం ♦ చానందుఁడై పూర్వ ది
గ్వీరుం డంపిన కాన్కయో యనులలిన్ ♦ విభ్రాజిలెన్ భానుఁడున్.

మ॥ అకలంకుం డటఁ గాలకృత్యములు నొ ♦ ప్పారంగఁ గావించి పా
దుకలన్ భక్తిని పూజచేసి మఱి వా ♦ తూలాత్మజుం గాంచి దై

త్యకులాహివ్రజ పక్షిరాజ! రవితే ♦ జా! నీదు వాక్యావళుల్
వికటార్థంబును పొందఁగానగునె యీ ♦ విశ్వంభరన్? మారుతీ!

మ॥ కపిసైన్యంబులు దైత్యవాహిను లసం ♦ ఖ్యాకంబులై వచ్చుచో
విపులక్షోణి భరింపలేక వెగడున్ ♦ వేపొంద ధూళి వ్రజం
బుపరి వ్యోమముఁ గప్పదే? యులబలం♦బుద్వేలమై లేచి స
ప్త పయోరాసుల ఘోషణంబు పగిదిన్♦వర్తిల్లదే? పావనీ! ౧౬౮౧

మ॥ పరివారంబులు నిండియుండెను భర ♦ ద్వాజాశ్రమం బింక ద
వ్వరయన్ లేదు ప్రశాంతమై యమరునే ♦ యావీడుపట్టింతగా
బరువై నామది సంశయించెను జగ ♦ త్ప్రాణాత్మజా! జానకీ
శ్వరుఁ డెందుండెనొ తెల్పరాదె? యనుచున్ ♦ సామీరి తానిట్లనున్.

మ॥ వ్రతసంపన్న! మునీశ్వరుండు సురలన్ ♦ ప్రార్థించి కల్పింప స
న్మతిఁ బుష్పానవ కందమూల ఫల సం ♦ పత్తిం బ్రసేవించి నో
ళ్లతిమాత్రంబుగ నార్పలేని గతిచే ♦ నట్లుండెఁ గాదేని సి
ద్రితమై యుండఁగఁబోలు నిక్కమిది చిం ♦ తింపంగ నీకేటికిన్? ౧౬౮౩

—: గుహుఁడు రాముం గానవచ్చుట :—

ఉ॥ కన్నులపండువై తనరఁ ♦ గాంచెదు రామునిరాక నిప్పుడే
పన్నుగ నంచు సాంత్వనము ♦ పల్కఁగ నచ్చట మానివిందు నా
పన్నజన ప్రసన్నమతి ♦ ప్రాఁతిగ మిత్రులతోడఁ దృప్తిమైఁ
గొన్నతఱిన్ గుహుండు కను♦గోఁ జనుదెంచెను గొప్పసేనతో. ౧౬౮౪

ఉ॥ వచ్చి మనంబు కన్నులును ♦ వాఁచిన పోల్కిని గాంచి కాంచి పై
నిచ్చఁ బ్రదక్షిణించి రహి ♦ యించి పదంబుల వ్రాలి రాముఁడున్
గ్రుచ్చి కవుంగిలించుకొని ♦ కూరిమి మీఱఁగ క్షేమవార్తలన్
బెచ్చుగఁ బ్రశ్న సేయ రఘు♦వీరుని చూచి గుహుండు ప్రీతిమై. ౧౬౮౫

ఉ॥ వారక దాసుపై భవ ద ♦ పార కృపారస దృష్టి గల్గుచో
దార సుతాదు లౌదురె యు ♦ దార హితుల్? వెనువెంటనంటి నే
వారతి నున్న లక్ష్మణుని ♦ భాగ్యము నోచని దుర్భగుండ నా
కారయ క్షేమసంపదల ♦ కంతముగల్గునె? రాక్షసాంతకా! ౧౬౮౬

మ॥ అని చింతించు గుహుం గనుంగొని ఘన ♦ శ్యాముండు రాముండు తో
ట్టిన ప్రేమంబున నీవు నాభరతుకం ♦ టెన్ జూడ వేఱయ్యెదే?
ఘన సౌఖ్యంబులు గల్గుగాత మన నా ♦ కైవర్తకస్వామి భ
క్తిని భూజాతకు లక్ష్మణాఖ్యునకు ప్రే ♦ మైకన్ వారు దీవింపఁగన్.

తే॥ గుహుని రవిసుతాదులకుఁ బె ♦ న్గూర్మిఁ జూపి, యితఁడు మన స్నేహితుఁడు జీవ ♦ హితుఁడు గాంగ
భూములకు ఱేఁడు గుహుఁడను♦పుణ్యచరితుఁ, డనుచుఁ దెలుప నెల్లరుగొని♦యాడిరతని.

క॥ ఎల్లరు నిష్టాగోష్ఠిగ, నుల్లాసంబునను కలిసి♦యుండఁగ రవి రం
జిల్లెను పడమటికొండన్, ఫుల్లాబ్జాక్షుఁడు స్వకృత్య♦ములఁ దీర్చికొనన్. ౧౯౮౯

తే॥ సీతతో రామచంద్రుండు♦సెజ్జఁ జేరె, గుహుఁడు సౌమిత్రియును కపి♦కోటి దనుజ
నికరమును పరివేష్టించి♦నియతినుండఁ, బెల్లు మాటల భల్లునఁ♦దెల్లవాఱె. ౧౯౯౦

శా॥ పంకేజాక్షుఁడు కాల్యకృత్యముల ని ♦ ర్వర్తించి మాసేంద్రు మో
దాంకంబైన యనుజ్ఞగైకొని విమా ♦ నారూఢుఁడై యోగి ని
శ్శంకప్రేమమయాంతరంగుఁడగుచున్ ♦ సాగింప వెన్నంట నా
తంకంబేమియు లేక వెల్వడియె మి ♦ త్రవ్రాతముల్ గొల్వఁగన్. ౧౯౯౧

తే॥ పుష్పకంబు శీఘ్రముంబుగఁ♦బోవుచుండఁ, జందమైన శిల్పంబుల♦నంద మొంది
యింద్రపురి ధిక్కరించుచు♦నెసఁగు స్వపుర, దుర్గ కుడ్యముల్ కనులకుఁ♦దోఁచెఁదనియ.

తే॥ అనుఁగులంగని వర్ణింప♦నలవికాని, యశమునొందిన సూర్యాన్వ♦యాధిపతుల
రాజధాని కానఁగవచ్చె♦రాజిలంగఁ, గాంచుఁడన లేచి కేల్మోడ్చి♦కాంచినారు.

—: భరతుఁడు శ్రీరామాదులం గాంచుట :—

తే॥ గగనమందు పెక్కురు దివా♦కరులకాంతి, గలిగి వెలుఁగు విమానంబు♦కానఁబడఁగ
నదిగొ వచ్చె రాఘవుఁడని♦యాంజనేయుఁ, డలరి కేకలువైచి ప్ర♦క్కలకుఁ జూచి.

క॥ కమలాక్షుఁడు కపిసేనయుఁ, గమలవదన లక్ష్మణుండు♦కన్నులు తనియన్
బ్రమదమున నేగుదెంచిరి, తమిఁ గనుమని చూపె భరత♦ధాత్రీశునకున్. ౧౯౯౨

ఆ॥ ఎల్లలోక వాసు♦లెక్కినఁ జోటింత, యొనరునదియు సాటి♦యొనరనిదియు
జిగి దిశాంతములకుఁ♦జిమ్మునదియునైన, పుష్పకంబు గాంచె♦భూరియశుఁడు.

తే॥ మేరు గుహను మెఱుముతోడి♦మేఘభాతి, పుష్పకమున జానకితోడ♦భూవరుండు
కానరాఁ గాంచె భరతుండు ♦ కన్నవారి, కలకలము లేచి లంకను♦కడచిచనియె.

ఉ॥ స్నాయు వసా వికార మలి ♦ నమ్మగు దేహము వీడి సత్యమున్
బాయక కోరి విష్ణు భువ ♦ నంబు భజించిన తండ్రిఁ గాంచు నా
తోయమునొంది కానలకుఁ ♦ దూలిన ప్రాణము వంటి యుల్లస
త్తోయజనేత్రుఁ గాంచె భర ♦ తుండు కుతూహలియై గహించుచున్.

తే॥ దోవుపోయిన వస్తువు♦దొరకినట్లు, వెతలు దొలఁగంగ సమ్మోద♦వివశుఁడగుచు
భువనవంద్యునకుం గేలు♦మోడ్చెఁదలఁచి, భరతుఁడప్పుడు పావని♦కరము వీడె.

క॥ హనుమంతుఁ డపుడు గగన, మ్మున వచ్చి విమానమునకు♦మున్నుగఁ జని రా
మునకుఁ బ్రియమ్ముగ వందన, మొనరిచి యిట్లనియెఁ బ్రేవ♦మొదిఁగి నిలుచుచున్.
ఆ॥ వహ్నిఁబడఁగనున్న♦భరతుని చేరి మీ, జాడ దెలిపి సాహ♦సంబు మాన్పి
యెల్లరకును మోద♦మొసఁగించితిని వారు, వచ్చి రనుడు ధాత్రి♦వరుఁడు నలరి.
ఉ॥ మారుతి! దుర్భరంబులగు ♦ మా యెడరుల్ బహుళంబులయ్యె నీ
వారని సత్కృపామతి ని ♦ వారణచేసెను మాతపఃఫలం
బీ రహి నీస్వరూపమున ♦ నేడ్తెఱవచ్చి తొలంగఁదోలె నీ
పారము లేని మేలునకుఁ ♦ బ్రత్యుపకార మొకండు కల్గునే? ౧౭౦౨
చ॥ నిరతము తోడునీడయగు ♦ నిన్నును నాతలిదండ్రులం గృపా
శరధిని లక్ష్మణున్ భరతుఁ ♦ జయ్యన నొక్కొకమాటలోనఁ ద
ద్గురుగుణ సంపదల్ దెలుపఁ ♦ గూడునె? సన్నుతశీల! దానవ
ద్విరద మృగేంద్ర! మేరు సమ ♦ ధీర! మదీయ తపఃఫలాకృతీ! ౧౭౦౩
తే॥ ప్రథితగుణుఁడు రాఘవుఁ డిట్లు♦పలుకుచుండఁ,బాదుకలఁ దలఁదాల్చిన♦పావనుండు
వ్రతములం గృశియించిన♦వాఁడు కేలు,మోడ్పుగలవాఁడు భరతుఁడు♦మొనసి డాసె.
తే॥ తల్లి గుణములకుం బగ ♦ దాయ కోస, లమ్మునేలిన యేలిక ♦ తమ్ముగుట్టు
వచ్చెఁ గనుమని చూపె శ్రీ♦వల్లభునకు, ధర్మములకెల్ల సాక్షిగాఁ♦దనరు హనుమ
క॥ కాంచిన రాముఁడు దశరథుఁ, గాంచిన తఱినొందు కౌతు♦కంబును పొందెన్
మించి తన మేను పులకల, నించెన్ గనుదోయి జలము♦నించెను తోడ్తోన్. ౧౭౦౬
క॥ కాంచెద జననులఁ బౌరుల, నంచితులన్ గురుల బాంధ ♦ వావలినెల్లన్
గాంచెదఁగాకని మనమున, నెంచిన యంతన విమాన ♦ మిలకుం దిగియెన్.
క॥ క్రిందికి దిగిన విమానం, బందఱుకును పుణ్యఫలము ♦ లందింపంగా
బృందారక లోకమునకు, నొందం గొని చను విమాన♦మో యన నొప్పెన్.
సీ॥ ఎడపడియున్న క్రే♦పెనయ గోవును డాయు, వలనుగాఁ గన్నత♦ల్లులకు నొప్పె
మాయ నీఁగిన వారి♦మనము లయించు జ్యో, తీరూపమునఁ దప♦స్విసతుల కొప్పె
వ్యాధిచే నీఁగిన ♦ ప్రాణముల్ మరల వ, చ్చినపోల్కి కోసల♦జనుల కొప్పెఁ
గన్నవారలకెల్లఁ ♦ గన్నతల్లిగ నొప్పె, మగువలకు మధువు♦పగిది నొప్పె
తే॥ భరత శత్రుఘ్నులకుఁ గను♦పాపలట్లు, ప్రేమగలవారలకు సురా♦మృతము కరణి
నొప్పె నప్పుడు తమువీడి♦యున్న రామ, భద్రు నాగమనము కను♦పండు వగుచు.
ఉ॥ రాముఁడె జీవమై తనరు ♦ రాజ్యమునందు నయోధ్యయందు రా
మామణులున్ జనంబులును ♦ మానిత శుద్ధ మనోజ్ఞ భావ సు
స్థేమము లొందినారు సుర ♦ సేవ్యుని రాకను హేమపుత్త్రికా
స్తోమము జీవమొందు క్రియ ♦ శోభిలినారు ముదంబు పెంపునన్. ౧౭౧౦

తే॥ చందనముగందవాడియుఁబు-ష్పములువెన్న,తురగఫేనంబుగజమద-తోయములును
మోద బాష్పముల్ గలిసి స♦ముద్రజలము, పగిది నుప్పొంగెఁ బ్రవహించె♦వసధిఁజేర.

చ॥ ధరణికి డిగ్గఁ బుష్పకము ♦ తల్లులు తమ్ము లరుంధతీవిభుం
దురవుగ నెక్కునంతఁ బురు ♦ షోత్తముఁ డప్డు వసిష్ఠు పాద పం
కరుహము లంటి మ్రొక్కఁ దమ ♦ కంబున నాతఁడు లేవనెత్తి యా
దరమునఁ బెక్కుమార్లు తన ♦ దప్పి యడంగఁ గవుంగిలించెనే.

చ॥ పదపడి లక్ష్మణుండు పద ♦ వందనముం బొనరింప దీవనల్
ముదమునఁ జేయుచున్ శిరము♦మూర్కొనె జానకి వచ్చి మ్రొక్కఁగా
సదయుఁడు సర్వసౌఖ్యము లె ♦ సంగుతమంచు వచించెఁ బ్రీతి గ
ద్గదిక రవంబుతోడఁ బుల ♦ కమ్ములకుం గులకమ్ముగా నొడల్. ౧౭౧౩

మ॥ తొలుతన్ రాముఁడు కైకయంఘ్రులకు సం♦తోషంబుతో మ్రొక్కి య
వ్వలఁ దక్కుంగల తల్లులం దెలవ న ♦ వ్వారల్ మహోత్కంఠతోఁ
బలుమాఱుల్ తల మూరుకొంచుఁ దనువున్ ♦ బాఢంబుగా దువ్వుచున్
జెలఁగన్ మోద జలాభిషేచనము తు ♦ ష్టింజేసి రప్పట్టునన్. ౧౭౧౪

మ॥ పొలుపొందన్ ధరణీ తనూజయు యథా ♦ పూర్వంబుగా వారికిం
దెలవన్ మా కులదీపమంచుఁ బొదువన్ ♦ దీవించి రావెన్కఁ ద
ల్లులకున్ లక్ష్మణుఁ డర్థి మ్రొక్కఁ దనువుల్♦పూరింప నొక్కండవే
జలజాతేక్షణు తమ్ముఁడై తివని రా ♦ శంసించి దీవించుచున్. ౧౭౧౫

సీ॥ పాదుకలను తన ♦ భక్తిని గానుక, గా సమర్పించి త ♦ ద్ఘన పదముల
వ్రాలిన భరతుని ♦ పోలంగఁ గని రామ, విభుఁడు మిక్కుటమగు♦వెత గదించి
నాల్కయెండఁగ నొక్క♦పల్కని వచియింప, నేరక నివ్వెఱ ♦ నిలిచి తనువు
ప్రాణంబు లొకటగు ♦ పగిది బిగ్గఁ గవుంగి, లించి మిక్కిలి పల ♦ వించి సోలి

తే॥ యశ్రుధారల లేఁత సో♦రడఁగఁ దిరులు, గట్టి దూసి క్రమ్మిన జడల్♦వట్టితడవి
శిరము మూర్కొని క్రేపును♦చేరు మొదవు, చందముననుండెఁ దనియక♦చాలతడవు.

చ॥ వినుత మహేంద్ర భోగ పద ♦ విం దృణకల్పముగాఁ ద్యజించి స
న్మునివర వేష చర్యలను ♦ పూని యశంబు గడించు తత్పవి
త్రుని చరణాంబుజంబులకు ♦ మ్రొక్కెను భక్తిని లక్ష్మణుండు త
ద్ఘన పదరేణువుల్ శిరముఁ ♦ దాఁకి పవిత్రత గూర్ప నొయ్యనన్.

చ॥ వనముల నగ్రజన్ము పద ♦ వారిజముల్ భజియింపఁ దోడుగాఁ
జని శ్రమకోర్చి నిద్రయును ♦ చక్కియఁ జేరఁగ నీక త్రోచి జీ
వనముల నప్పగించి వసి ♦ వాడిన మేనిని దీర్ఘబాహులం
దనువుగఁ గౌఁగిలించె భర♦తాఖ్యుఁడు దేహము పావనంబుగాన్. ౧౭౧౬

మ॥ దురితధ్వంసియుఁ బిన్నతమ్ముఁడగు శ ♦ త్రుఘ్నుండు సీతాహృదీ
శ్వర సౌమిత్రుల పాదపద్మములు శీ ♦ ఘ్రంబంటఁగా మ్రొక్క వా
రరుదా ప్రేమను కౌఁగిలించికొని ♦ మి శ్రాస్రంబులం జార్చి ని
ర్భర మోదంబున నల్వురుం బొదలి రా ♦ ర్ద్రింబైన చిత్తంబులన్.

మ॥ జనకక్ష్మావిభు పుత్త్రికిన్ ♦ భరతుఁడున్ శత్రుఘ్నుఁడున్ మ్రొక్కఁగాఁ
దనుఁ దావచ్చిన శీర్షకంబు తొలఁగం ♦ దాటించు శీర్షంబు మె
ట్టన ముల్లోకములం జయించు దనుజా ♦ ధ్య ప్రార్థనం ద్రోచు కా
ళ్లు నొకొండొండు స్పృశించి పావనత పొ ♦ ల్పుం బొందె ధన్యంబులై.

చ॥ విమలుల సూర్యపుత్త్రక వి ♦ భీషణ జాంబవ దంగదాదులన్
క్రమముగఁ జూప వారలు భ ♦ రంబగు భక్తి నమస్కరించి రా
సుమహితచిత్తులన్ దనుజ ♦ సూదను తమ్ములు ప్రేమ మీఱఁగా
సముచిత రీతులం దనియ ♦ సత్కృతులం బొనరించి రత్తఱిన్. ౧౭౨౧

చ॥ సచివులు దండనాథులును ♦ సంగడిరాజులు రా సుమంత్రకుం
డచటికి వచ్చి సమ్మదము ♦ నంగద పోరొనరింప మ్రొక్కి యీ
యచలకు భారమై తొడరు ♦ నాపద లేదిఁక నంచుఁ బల్కఁగా
నుచిత విధమ్మున న్నరవ♦రోత్తముఁ డాదృతిఁ గాంచె వారలన్ ౧౭౨౨

ఆ॥ సేనలెల్ల వచ్చి♦సేవింప నందఱుఁ, బుష్పకంబులోనఁ♦బొలుపుమీఱ
నిలువుఁడనఁగ వచ్చి♦నిలిచి లక్ష్మణునకు, భూమిదేవి సుతకు♦మ్రొక్కినారు.

చ॥ విరుల సరంబు లెల్లెడల ♦ వ్రేలు విమానము చూడఁ బంకజో
దరు నుదరంబొ వార్ధి యమృ ♦ తంబులఁ గ్రోలు నగస్త్యు దొడ్డయా
కరతలమో సమానమగుఁ ♦ గాదని ఖేచరు లబ్రమందుచున్
విరులను చల్లినారు రఘు ♦ వీరుని కీరితి నుగ్గడించుచున్. ౧౭౨౪

సీ॥ భేరి రావములు శం♦ఖారావములు బ్రౌహ్మ, కాళీరవంబు గ♦జాశ్వరవము
కాహళధ్వనులు మం♦గళ నినాదంబులు, భూనభోంతరములు♦బోరు కలఁగ
నంబుధి ఘోషంబు♦డంబు విడంబించి, లేఖుల రవముతో♦లీనమయ్యె
మహిత విమానంబు♦రహిలేచి యటనుండి, సాకేతపథమున♦సాగుచుండి

తే॥ యవనితోడను భూజను♦లమరపురికిఁ, గదలు పగిది శక్రుండు స్వ♦ర్గంబుతోడ
నిలకు వచ్చుచందంబున♦నెనసి వెలసి, పొలుపుతోడ నందిగ్రామ♦మునకువచ్చె.

—: ౩౮ శ్రీరామ పట్టాభిషేక పటలము :— (౪౨)

మ॥ స్థిరశీలుండగు రామచంద్రముఁడు నం ♦ దిగ్రామముంజేరి ము
న్నురవై యున్న జటాభరంబు లట నా ♦ యుమ్మర్శచే నూడ్చి భూ

వర వేషోచిత మండనంబు లిరవా ♦ ప్పం దాల్చి రత్నద్యుతిన్
బురుహూతుంబలెఁ బొల్చెఁ దమ్ములు లస ♦ ద్భూషాలిచే శోభిలన్.

శా॥ ఆకాశస్థలి నంటి నిక్కి ధ్వజ వ ♦ స్త్రాంచ త్కరాబ్జంబులన్
సాకేతంబున కేగు దెండనుచు నా ♦ సం బిల్చు చందాన న
స్తోక ప్రాభవ మండిత ప్రభలతో ♦ శోభిల్లు స్వాయోధ్యకున్
శ్రీకంజాక్షుఁడు చేర నెక్కె రథమున్ ♦ శ్వేతాశ్వ సంయుక్తమున్.

తే॥ కొమరుగాలక్ష్మణుఁడు తెల్ల♦గొడుగునూనఁ, జామరంబుశత్రుఘ్నుఁడు♦చాఁచివీవ
దివిరి భరతుఁడు బంగారు♦ తేరు దోల, నుత్సుకుండయి రాముఁ డ♦యోధ్య కేగె.

ఉ॥ వానరనాథుఁడున్ దనుజ ♦ వర్యుఁడు భద్ర గజాలమీఁద స
మ్మానిత రీతి నెక్కి యిరు ♦ మైఁ జనుదేరఁగ నంగదుం డసం
ఖ్యాక జనంబు సందడుల ♦ నారఁగఁబాపుచు ముందుపో హనూ
మానుఁడు వెంబడించెను స♦మంచితభక్తి భజించి కాల్నడన్. ౧౨౨౯

చ॥ సముచిత గౌరవంబులకు ♦ స్థానములైన మనుష్య రూపముల్
ప్రమదముతోడఁ గైకొని ♦ సు ♦ వాసిత చందన గంధ ఘుమఘుమల్
క్రమియఁగ వానరుల్ హరుల ♦ గంధగజంబుల మీఁద నెక్కి స
క్రమముగ ముందు వెన్కలను ♦ ప్రక్కల నేగుచునుండి రొయ్యనన్.

చ॥ ద్విరదములన్ బసిండి మణి ♦ తేరులఁ దేజుల నెక్కి ఛత్ర చా
మర విభవంబుతోడ నృప ♦ మాన్య కిరీటములోడ నొప్పు భూ
వరు లెనమండ్రు పండ్రుగురు ♦ భక్తిని నూరెల నిల్చి కొల్చుచున్
సరస మృదూక్తులన్ హిత య ♦ శస్కర వార్తలఁ బల్కుచుండఁగన్.

చ॥ కపికుల కామినుల్ విబుధ ♦ కాంతల రూపము లొంది నిశ్చల
చ్చపలలభంగి హస్తినులఁ ♦ జక్కని గోడిగ లెక్కి చుట్టి రా
విపులకుమారి రిక్కగమి ♦ వెల్గు నిశాకర బింబమో యనన్
దిపురులు గట్టు కాంతులను ♦ తేజిలి యేగె విమానమందునన్. ౧౨౩౨

చ॥ ఖచరులు మానులుం బరమ ♦ కౌతుకమందఁ బ్రనూన వర్షమున్
ప్రచురము గాఁగఁ జింద ధర ♦ స్వర్ణ లతాంత మయంబ యౌట నా
యచల వసుంధరాఖ్య యట ♦ సార్థకమై తనరారె రాట్కృపా
విచలిత దృష్టి హేమమయ ♦ వృష్టిఁ బ్రపాతమొనర్చె నిట్లనన్. ౧౨౩౩

ఉ॥ వెన్నెల కాలమందొసరు ♦ పీత జలంబగు వారిదంబు నా
నెన్నఁగ నిన్నినాళ్లు మద ♦ మింతయుఁ గార్పని వారణావళుల్

మన్నని రాకఁ గాంచి తమ ♦ మక్కువ లోపల నిల్వఁజాలమిన్
బ్రన్నన఼ బ్రోచికొంచు వెలి ♦ వచ్చెనొకో యనఁ గాన్చె నత్తరిన్.

ఉ॥ మూఁగలు మాటలాడు క్రియఁ ♦ బోఁడిమి హేమలొనర్చె వార్వముల్
బాగుగఁ బుష్పవాటికలు ♦ పల్లవితంబులు పుష్పితంబులై
మేఁగెను పువ్వుఁబోండ్ల యెల ♦ మేనులు బంగరు రంగుమీఱె రా
మాగమ మొప్పె ధాత్రిని చ ♦ రాచర కోటికి మోద దాయియై.

ఉ॥ రాజ్యము నేలఁగాఁ దగిన ♦ రాముఁ డయోధ్యను చేరి తల్లులన్
బూజ్యుల మ్రొక్కి వేల్పులకుఁ ♦ బూజ లొనర్చి వసిష్ఠు నాజ్ఞమైఁ
బ్రాజ్య ధరాధిదేవియును ♦ పద్మ నివాసిని యుల్లసిల్లఁగా
భోజ్య పదాస్పదంబయిన ♦ భూపతి హర్మ్యముఁ గాంచె నయ్యెడన్.

చ॥ వలువలు వీడఁ జూడకయు ♦ భామలు ధీరులు జాఱుచున్న దు
వ్వలువల మాటిమాటికిని ♦ వారక వీడక చెక్కికొంచు మే
నులు గమనింపనైరి తమి ♦ నూల్కొన నానవమాని చొక్కుచున్
వలువలు జాఱఁగా జరగు ♦ బాగున నొప్పిరి చూచువేడుకన్. ౧౭౩౭

ఉ॥ తొండరచే భుజిష్యకల ♦ దువ్వలువల్ నృపతుల్ ధరించుచున్
జందనగంధు లుద్భు తెలి ♦ చల్వలు పూరుషరాజి తాల్చుచున్
గ్రందుగనున్న గుంపునఁ జొ ♦ రం గలపంబు లలందకున్న నం
దందొరయంగ నిమ్మడిగ ♦ నందె శరీరము లా జనావలిన్. ౧౭౩౮

ఉ॥ రామ వియోగమైన తఱి ♦ రామలు మోద విహీనలై సదా
నోములు నోచుచుం బతి వి ♦ నోదము లొందకయుండు వారలున్
రాముని రాకతో శుభ క ♦ రంబగు భూమలచేత మేనులన్
భామలు దాఁచినారు తమ ♦ భర్తల చిత్తము పల్లవింపఁగన్. ౧౭౩౯

తే॥ సుర కలాపంబుతో మను♦జుల కలాప, మొరసికొనుటచే నర దేవ♦తరుణులకును
పతులు డాసిన తఱినొక♦కతము కనని, యలుక పొడమె భర్తలమీఁది♦యరమరికను.

చ॥ భరతుని గాంచి రాఘవుఁడు ♦ పావన శీలుని సూర్యపుత్త్రుఁ గ
ర్బురపతిఁ దక్కువారలను ♦ మోదముతోఁ గొనిపోయి యిందు చి
త్తరువులఁ జిత్రదృశ్యములఁ ♦ దన్పుగఁ జూపు మనంగ నాతఁ డ
త్యురుతర గౌరవంబున మ ♦ హోత్సుకతన్ గొనిపోయె లోనికిన్. ౧౭౪౦

—: సుగ్రీవాదులు నగరునందలి చిత్రదృశ్యములఁ గాంచుట :—

తే॥ మిత్రవర్గంబు వెంటరా♦మిహిరకులుఁడు, పెక్కు కక్ష్యలు దాఁటి గం♦భీరమగుచు
మేరువుంబోలె విలసిల్లి♦శ్రీరహించు, సద్మమైన శుద్ధాంతంబు♦సరగఁ జొచ్చె.

చ॥ రవిజ విభీషణాదులు సు ♦ రత్న మయూఖచయంబు లెల్లెడన్
బ్రవిమలకాంతులన్ వివిధ ♦ భంగులఁ జిమ్ముటచే భయంబునం
దవిలి మనంబు భావములు ♦ తత్తతిలం దడఁబాటు నివ్వెరన్
మివుల భజించి మేడుపడి ♦ మేగలి తెప్పల నార్పరైరటన్. ౧౭౪౩

చ॥ హరియురమందు రాజిలు మ ♦ హామణియట్లు వెలుంగు సౌధమున్
వెరగొని కాంచి యెవ్వ రిది ♦ వేడ్క సృజించిరో తెల్పవే యనన్
భరతుఁడు కుక్షితండ్రికిఁ ద ♦ పఃఫలమై చన మున్ను మెప్పునన్
సరసిజ సంభవుం డొనఁగు ♦ సౌధ వరం బిది నాఁగ వారలున్. ౧౭౪౪

తే॥ కమలవాసిని కిది మేటి♦కాణయాచి, వర్ణనము సేయ మాబోఁటి♦వారు వలఁతు
లగుదు రే ? యని కేల్మోడ్చి♦యవలనున్న, మండపము చూడఁ బోయిరి♦మందగతుల.

తే॥ రావణానుజాదులు సౌధ♦రాజ మహిమ, వినుతి సేయుచు నుండఁగ♦నినసుతుండు
శ్రీరఘూత్తము పట్టాభి♦షేక దినము, నరయకుండు టేలొకొ యని♦భరతునడిగె.

తే॥ వార్ధుల జలంబు బహుపుణ్య♦తీర్థజలము, వచ్చి చేరుట యొకనాఁటి♦పనియె యనుచు
భరతుఁడాడఁ గపీంద్రుండు♦వాయుపుత్త్రు, మోము గాంచునంత నతండు♦భూమి దాఁటె.

తే॥ కులగురుని తక్క ఋషులను♦పిలువుమనుచు, భరతుఁడనఁగ సుమంత్రుండు♦సరగ నేగి
శిష్య మిత్రబృందముతో వ♦సిష్ఠుఁదోడఁ, బిలుచుకొనివచ్చెఁ దత్సభా♦నిలయమునకు.

శా॥ భక్తిం గైకసుతుండు మానికి నమో ♦ వాకంబు లర్పింప స
న్ముక్తుం డమ్ముని ప్రేమమైఁ దిరముగా ♦ భూదేవి శ్రీదేవియున్
రక్తిం జెంద మహేంద్రుచందమున శ్రీ ♦ రాముండు పట్టంబు నం
సక్తిం బొందఁగ రేపె గల్గు శుభ మా♦సాదించు లగ్నంబనన్. ౧౭౪౯

క॥ సురగురు సములౌ తాపస, వరులును రామాభిషేక♦భాస్వల్లగ్నం
బిరవుగ స్వర్ణాక్షరముల, విరచించిరి లేఖ లవని♦విభులకు నంపన్. ౧౭౫౦

క॥ దూతలు త్రిలోక వాసుల, కాతతమతిఁ దెల్ప వినిన♦యందఱు నిలువం
జేతము లొల్లమి వచ్చిరి, ప్రీతిన్ వారలను లెక్క♦పెట్టఁగ వశమే ? ౧౭౫౧

తే॥ అల వసిష్ఠుతో భరతుఁడు♦నర్కసుతుఁడు, రావణానుజుఁ డంగద♦ప్రముఖ నిఖిల
దనుజ భల్లూక వానర♦మనుజవరులు, కలిసి శ్రీరాము నొద్దకుఁ♦గడఁకఁ జనిరి.

క॥ పట్టాభిషేకమునకున్, నెట్టన శుభదినము రేపె♦నియమిత విధులన్
బట్టుగఁ జేయుము దశరథు, పట్టీ! యని గురుఁడు తనదు♦భవనము చేరెన్.

క॥ నలువ పనుప మయుఁడు శుభా, కలనమునకు రాఘవేంద్రు♦గౌరవమునకున్
వలసినలలి లోకోత్తర, లలితచతుర మండపం బ♦లంకృతి సేసెన్. ౧౭౫౪

ఆ॥ సప్తసాగరముల♦జలములు పుణ్యతీ, ర్థముల జలముఁ దెచ్చి♦తగినచోట్లఁ
బవన తనయుఁడుంచె♦బంధుర పద్ధతి, నంద అరసి వెఱఁగు♦నందుకొనఁగ. ౧౭౫౫

తే॥ కువలయేశులు తెల్లని♦గొడుగుతోడ, భద్రకరులపై రత్నకుం♦భముల నునిచి
వివిధ వాద్య ధ్వనులు రేఁగి♦విస్తరింప, సరయు జలములఁ దెచ్చిరి♦సరభసమున.

తే॥ వజ్రపాదముల్ మాణిక్య♦ఫలక మమరు, పసిఁడిగద్దె స్ఫటిక మండ♦పమున నొనర
నుంచి రందుపై భుజకీర్తు♦లుల్లసిల్లు, బాహులు వెలుఁగ సీతతోఁ♦బ్రభుఁడుచేరె.

—: రాముఁడు పట్టాభిషిక్తుఁ డగుట :—

సీ॥ మంగళగీతంబు ♦ లంగు చెలంగ వే, ద ధ్వనులలర చిం♦దంబు లడర
బహువిధ వాద్యముల్♦ప్రబలంగఁ దాళ మ్మృ, దంగ రావము లుదా♦త్తతఁ జెలంగ
సురలు క్రొవ్విరుల నో♦త్తరముగఁ గురియంగ, మొదటి వేలుపు మొట్ట♦మొదట వచ్చి
యభిషేక మొనరించె♦నవ్వలఁ బశుపతి, మానులు విప్రులు♦మంత్రివరులు

తే॥ పౌరవృద్ధులు కపిరాజు♦వాయుజుఁడు వి, భీషణుండు మున్నగువారు♦పెరిమతోడ
వచ్చి యభిషేక కార్యంబు♦వాంఛితార్థ, సిద్ధిగాఁగ రాఘవునకుఁ ♦ జేసినారు.

శా॥ ఆనాఁ డొక్కపదంబునే కదుగు ది ♦ వ్యాంభగ్రప్రసారం బుమా
ధీనుం డెక్కువ మక్కువం గొనుచు నె ♦ త్తిం దాల్చె నాబ్రహ్మయే
యీనాఁ డంగము పూర్తిగాఁ గడుగఁగా ♦ నీనీర మేచోట నీ
శానుం డాదటఁ దాల్చునో యనుచుఁ గాం ♦ తుం జూచి రింద్రామరుల్.

చ॥ మరకత పర్వతం బొకటి ♦ మానుగఁ దోయజరాజిఁ బూచి పెం
దరఁగల నాని రెండు కను ♦ దమ్ములు వీనుల నంటుచుండు నొ
ప్పరవగు నెమ్మితోఁ జెలఁగు ♦ నోజ భజించిన రాము నున్నత
స్ఫురదురు రూపముం గనిన ♦ పుణ్యులు ద్రెంచిరి బంధ దుఃఖముల్.

మ॥ అభిషేక క్రియలెల్ల సక్రమముగా ♦ నారన్ మహాప్రేమ లో
లుభులై మానులు తోడ్పడన్ బనులు చా♦లున్ మూలగా బ్రహ్మ స
న్నిభుఁడా శిష్ట వసిష్ఠమౌని జరుపన్♦నింపెన్ సుమంత్రుండు గో
త్రభిదుం గొల్చి యొసంగు కల్పకము నా♦ద్రవ్యంబు లవ్వేళకున్. ౧౭౬౧

సీ॥ శ్రీరామ పాదుకా♦సేవాభి నిరతుండు, భరతుండు ఛత్రంబుఁ♦బట్టినిలువ
సౌభ్రాత్ర నిధులు ల♦క్ష్మణుఁడు శత్రుఘ్నుండు, వినతులై చామరాల్♦వీచుచుండ
నిత్యానపాయిని♦నిఖిల జగన్మాత, సీత వామాంక సం♦స్థితి రహింప
శ్రీరామ ముద్రికా ♦ చిత్త సంధావని, పావని పదపీఠ♦మై రహింప

తే॥ హరి నిశాచర సామంత♦వరులు బలసి, రామకృత విక్రమములు కీ♦ర్తనము సలిపి
కొలువ రాముఁడు సకల స♦ద్గుణ గణాభి, రాముఁ డవ్వేళఁ బట్టాభి♦రాముఁడయ్యె.

ఉ॥ శ్రీయును భూమియుం జెలఁగు ♦ శ్రేష్ఠ భుజుండగు రాఘవుండు సం
శ్రేయము లుల్లసిల్లఁగ † వ ♦ సిష్ఠుఁడు దీవనతోడ నుంచు శో
భాయత రత్న శీర్షకము ♦ భవ్య ముహూర్తమునందు భద్ర సం
ధాయి ధరించె లోకము లు♦దార ముదంబునఁ దేలియాడఁగన్. ౧౭౬౩

ఉ॥ శ్రీమకుట మ్మయోధ్యను వ ♦ సిష్ఠుఁడు మిక్కిలుచుండు మక్కువన్
రాము శిరమ్మునం దునుప ♦ రంజిలి మూఁడు జగంబులందు ని
ద్రా మది నెల్ల జీవులకుఁ ♦ దత్పరతం దమ నెత్తిమీఁద ను
ద్దామముగాఁగ నుంచిన వి ♦ ధమ్మునఁ బమ్మె ముదమ్ము సొమ్ముగన్.

ఉ॥ నోములు చాలకాలముగ ♦ నోఁచి పదంపడి కోరి యొందు ను
ద్దామ నెడన్ వియోగపడి ♦ తాపము చెంది కృశించి పిమ్మటన్
నేమము నొందు ధారణి వి ♦ శిష్టుని రాముని డాసినంతనే
ప్రేమను దీర్ఘబాహువుల ♦ బిగ్గఁ గవుంగిలిఁ జేర్చె వేడ్కనో. ౧౭౬౫

తే॥ శాస్త్రముఖని వసిష్ఠుఁడు తెల్పు♦సరణి రామ, విభుఁడు భరతుని శిరమున♦విమలమకుట
మూరనిడి పాలనవిధంబు♦లప్పఁజెప్పి, లీల నిత్య సుఖములఁ దాఁ♦దేలుచుండె.

## ౩౯. వీడుకోలు పటలము (౩౮)

తే॥ భూమిదేవికిఁ దొడవగు♦భూరి రత్న, ఖచిత హేమ మండపమున♦నుచిత పీఠ
మందు మెఱుపును మేఘంబు♦చెందినట్లు, జానకీ రామచంద్రు లా♦సీనులైరి

తే॥ పూర్వగిరిమీఁది రవివలె♦ముకుటమలర, మెఱుపుకరణిముక్తాహార♦ముఱిది వెలుఁగ
భువన జీవనదాయి జీ♦మూత భాతి, సింహపీఠిపై వెలసెను♦శ్రీకరుండు.

తే॥ మరకతాద్రిపై వెన్నెల♦మాడ్కి చెలుల, కరములందలి వెల్ల చా♦మరలు కదల
నమర నాగ విద్యాధర♦యక్ష సిద్ధ, సాధ్య గంధర్వ గణములు♦సన్నుతింప.

చ॥ తిలకము గల్గు నెన్నుదురు ♦ తీయని జాబిలి తేట వెన్నెలల్
జిలుకఁగ మింటనున్న చలి ♦ చీఁకటి గొంగ దినక్రమంబునన్
బొలుపఱ రావణాద్యసుర ♦ ముఖ్య వినాశక కీర్తి రూపమున్
చెలువున వెల్లవెల్లి విల ♦ సిల్లి శిరంబుపయిన్ రహింపఁగన్. ౧౭౭౦

† తిరువెణ్ణెయ్ నెల్లూరి జటప్ప వంశీయులగు పూర్వు లందియఁ గైకొని వసిష్ఠుఁడు రత్న కిరీటము శ్రీరాముని శిరమున నుంచెనని మూలము.

ఉ॥ మంగళ గీతముల్ చెలఁగ ♦ మాన్యుల దీవన లెచ్చిరిల్లఁ ద
న్వంగులు పాటపాడుచు ర ♦ సానుగుణంబుగ నర్తిలంగ ని
స్సంగులు నుల్లసిల్ల గుణ ♦ సంగులు మోదమునొంద వాద్యముల్
రంగుగ మ్రోఁగఁ గాహళ వి ♦ రావము పైపయి మిన్నుముట్టఁగన్.

చ॥ రవియును సిగ్గిలన్ వెలుఁగు ♦ రత్న కిరీట విభాసులైన మా
నవపతులెల్ల వచ్చి తమ ♦ నవ్య కిరీట చిరత్న రత్న ప
ల్లవ రుచు లంఘ్రి పంకజ వి ♦ లాస వికాసము వన్నె చిన్నెలం
దవిలి విలక్షణంబగు వి ♦ ధంబున మార్పడ మ్రొక్కుచుండఁగన్. ౧౭౭౨

చ॥ సచివులు చేరికం గొలువ ♦ సైన్యపతుల్ జయశబ్దముల్ వచిం
చుచు వినుతింపఁ దమ్ములును ♦ నూరెల నుండఁగ వంది మాగధుల్
రుచిరముగా యశోబ్ధి లహ ♦ రుల్ విజయాంక వినూత్న గీతికా
ప్రచయముతో నుతింపఁ జెలు ♦ వల్ పఠియింపఁగ.మంగళ స్తుతుల్.

క॥ నృపవరులు దనుజవరులుం, గపివరులును పౌరవరులు♦కైవారంబుల్
నిపుణత నొనరింపఁగ రహి, విపంచికల వైణికులు ప్ర♦వీణత చూపన్. ౧౭౭౪

తే॥ దినకర సుతుండు దానవా♦ధీశ్వరుండు, డాసి సేవించి వహి సుచి♦తాసనములఁ
గూరుచుండ రాముఁడు నిండు♦కొలువుసేయు, చుండు తఱివచ్చె గుహుఁడుసే ♦
వోత్కమతిని.

తే॥ పులి కళానంబు దట్టిగాఁ♦బూని కత్తి, నడుమునం జెక్కి నావిక♦నాయకుండు
పరిజనంబుతో వచ్చి శ్రీ♦వరుఁ బ్రదక్షి, ణించి సేవించి యొకవంక♦నిలిచె నొదిఁగి.

క॥ కరుణామయుఁడగు శ్రీరఘు, వరుఁడు తనదిటంపుఁ బ్రేమ♦వారలపై సుం
దర సుస్మితవిధిఁ జూపుచు, నురవుగఁ బలుకాడి యొసఁగె♦నుచితాసనముల్.

తే॥ సత్ప్రవర్తనమున గురు♦జ్ఞానులైన, వార లుచిత వాక్యజ్ఞులు♦ధీరవరులు
నిఖల కళలఁ బ్రవీణులు♦నీరజాక్షుఁ, గొలిచి తమతమ నేర్పుల♦వెలువరింప.

క॥ నరపతులును తక్కిన వన, చరపతులును దనుజపతులు♦సరసిజనేత్రున్
స్థిరభక్తిఁ గొలిచి యొఱుఁగక, జరపిరి తేలికగ వేడ్కఁ♦జన రెండునెలల్. ౧౭౭౯

ఉ॥ కారణజన్ముఁడైన రఘు ♦ కాంతుఁడు లోకము సంతసింప నీ
తీరున గద్దెపైఁ గొలువు ♦ దీరి ప్రియంబున వచ్చియున్న య
వ్వారల గారవించి పను ♦ పం దలపోసి పశువ్రజంబు బం
గారము క్షేత్రముల్ మణి ని♦కాయ మొసంగెను విప్రకోటికిన్. ౧౭౮౦

క॥ వలసినవి వలసినంతగ, వలచిన యాచకజనంబు♦పరిమోదమునం
దేలఁగ నొసఁగి పదపడి భూ, వుల రమ్మనికోరె రాఘు♦వుఁడు ప్రియమారన్.

క॥ హరులును శిబికలు తేరులు, కరులును మాన్యములు రత్న♦కాంచన భూషాం
బరము లవారిగఁ గాన్కఁగ, బెరిమను మన్నించి పిదప♦వీడ్కొలొసఁగెన్.

క॥ శంబర మర్దనునకుఁ దా, నింబుగ జనియించు వేళ♦నింద్రుఁ డొసఁగు ర
త్నంబుల కడెములతోఁ జీ, నాంబర తురగాదు లొసఁగె♦నర్క సుతునకున్.

క॥ మును కమలాసనుఁ డిక్ష్వా, కున కొసఁగిన యంగదములఁ♦గొమరుగఁ దనపే
రును సార్థపఱుప నెంచెనొ, యనఁగ నొసఁగె నంగదునకు♦నధికప్రేమన్. ౧౭౮౪

క॥ మఱియును ముక్తాహారము, కరి తురగ స్యందనములు♦కనకాంబరముల్
కరుణించి పిన్నతండ్రికి, నిరవుగఁ దోడగుమ యెల్ల♦యిమ్ముల ననియెన్. ౧౭౮౫

మ॥ ప్రియమారంగఁ గటాక్ష వీక్షణములన్ ♦ వీక్షించి సామీరి న
వ్యయ సాహాయ్య మొనర్చినట్టి ఘను లె♦వ్వారయ్య నీకేవ? నే
దియుఁ గన్పింపదు నీకుఁ బ్రత్యుపకృతిం ♦ దిట్టంబుగాఁ జేయ న
క్షయకీర్తీ! నను గాఁగిలించికొనుమా ♦ గాటంబుగా మారుతీ! ౧౭౮౬

శా॥ మా దేహంబులు నీయవే యనుచు ♦ [illegible]కై మాటించి హామూసి నీ
యాదేశంబె యుపాయనంబు మఱి యా ♦ లా! బిడ్డలా! నాకు నీ
పాద ద్వంద్వమె చాలునన్న రఘు భూ♦పాలుండు కేయూర హా
రాదుల్ దువ్వలువల్ మతంగజ తురం♦గాఢ్యంబు లర్పించుచున్.

మ॥ తలిరుంబోఁణి కనర్ఘమైన యొక ము ♦ క్తాదామ మిప్పించి యిం
దుల నెవ్వాని కొసంగ నీమనము సం♦తోషించు నవ్వానికే
లలి నీయం దగు దీవనన్ దన మనగి ♦ క్లాంతిం బ్రమార్జించు క
ర్వలి పట్టింగని యిచ్చె జానకి దయా♦ర్ద్రి స్వాంతయై గ్రక్కునన్.

క॥ రిక్కల కాంతులఁ బైకొని, రిక్కల రాయనికి నుపమ ♦ రీతిఁ జెలఁగుచున్
వాకాఁంత యొసఁగు నాసర, మొక్కఁడు గాకెక్కుఁ డొసఁగె♦నురు భూషణముల్.

క॥ కటకములు హారములు దు, ప్పటములు కేయూరములును♦పటు తురగ మదో
త్కట కరుల నరదముల ను, ద్భట వీరుని నలుని పిలిచి ♦ పార్థివుఁ డొసఁగెన్.

క॥ అతులిత భూషల నొసఁగెను, శతబలికి నమూల్యరత్న♦జవనాశ్వములన్
దతమతి కేసరి కొసఁగెను, ప్రతిలేని సువస్తువులను♦వారని కరుణన్.

ఆ॥ ద్వివిద తార నీల♦గవయ జాంబవదాది, వీరవరులఁ బిలిచి♦ప్రియములాడి
వలసినంత కనక♦వస్తు వాహనముల, నిచ్చనిడి కటాక్ష♦దృష్టిఁ జూచె. ౧౭౯౨

తే॥ గుణ గణాంచిత ఖని వి♦భీషణునిగాంచి, కలుషదూర ! నీసములు నీ♦కంటె లేరు
పసిఁడి కినుము సమంబగు♦పట్టునందు, నేని నీకు సమానులు♦గానరారు. ౧౭౯౩

తే॥ అనుచువినుతించిప్రియమున♦నమరులిచ్చు, కటకములుభద్రజాత్యనే♦కపచయంబు
కనక చేలముల్ కాంభోజ♦ఘనతురంగ, ములను కడు సుగంధ ద్రవ్య♦ముల నొసంగె.

తే॥ శృంగిబేర పురీశు నా♦రంగఁ గాంచి, నీకుఁ దెలుపంగ వలసిన♦నియతు లెవ్వి
యనుచు శ్వేతాశ్వ నికరముల్♦కనక రథ చ,యంబు పీతాంబరము లిచ్చె♦నింబుమీఱ

మ॥ హనుమ జ్జాంబవ దంగద ద్వివిద తా ♦ రాది ప్లవంగేశులన్
దినరాజాత్మజుఁ గాంచి వీడుఁడనుచుం ♦ దెల్పం దలంపంగనై
నను కారానిదె మైన మీపురములన్ ♦ నాణెంబుతో మేలు సం
తనగాఁ గాచుట నాకు ధర్మమగుఁ గా ♦ నన్ వేఁడెదన్ గావుఁడీ.

మ॥ దనుజాధ్యక్షున కాదటన్ వెడలుచో ♦ ధర్మంబుగాఁ దెల్పి మీ
మనముల్ దూరము కావ యంచుఁ బలుకన్ ♦ మన్నించి దైతేయ కీ
శ నిషాదాధిపు లెంతయున్ విడువ ని ♦ చ్ఛన్ లేనివారయ్యు రా
ముని వాక్యంబులు మ స్తమం దిడుటయే ♦ ముఖ్యంబుగా నెంచుచున్.

తే॥ భరత లక్ష్మణ శత్రుఘ్న ♦ ధరణిజాత, లను వసిష్ఠు ముగ్గురు తల్లు♦లను గుణాభి
రాము రాముని వలగొని♦ప్రణుతిచేసి, సెలవుగొని మరలిరి తమ♦నెలవుసేర.

తే॥ గుహుని శృంగిబేరమ్మునఁ♦గూర్మి విడిచి, యగచరేంద్రుని కిష్కింధ♦యందు వదలి
కర్బురులు పరివేష్టింప♦గగనవీథి, దైత్యపాలుండు తనరాజ♦ధానిఁ జేరె. ౧౭౯౯

సీ॥ మిత్రులఁ బంపి య♦మ్మిహిర కులేశుండు, తక్కు సుహృజ్జన♦తతులతోడ
నీతిమంతుండై య♦నీతిని సద్ధర్మ, హితుఁడయ్యు ధర్మంబు♦నెత్తకుండ
వర్ణాశ్రమాచార♦పరిపాలకుం డయ్యుఁ, దల్లి కూఁతుల నొక్క♦తమిని చూచి
తమ్ములు తన కను♦దమ్ములై వర్తిల్ల, జనులు తండ్రి యటంచు♦జనవుచూప

తే॥ క్షీరసాగరమందున ♦ శేషతల్ప, మందు యోగనిద్రను వీడి ♦ యవతరించి
చెడుగులం ద్రోచి మేలు ర♦క్షించు రామ, చంద్రుఁడేలె జగంబులు♦ చలువనొంద.

మ॥ జగదారాధ్యుఁడు రాముఁడై పుడమిలో ♦ జన్మించి దుష్టాత్ములన్
దగ ఖండించి ధరాతలంబున లస ♦ ద్ధర్మంబు నెక్కొల్పి పూ
జ్యగతిం బొల్చిన జానకీ విభుని స ♦ చ్చారిత్రమున్ భక్తి యొం
దఁగఁ బల్కన్ వినినన్ సుఖించి యట మీఁ♦దం గాంత్రు కైవల్యమున్.

మంగళ మహాశ్రీ

మంగళము రామునకు ♦ మంగళము తమ్ములకు
మంగళము సంతతము ♦ మైథిలికి వేడ్కన్
మంగళము మారుతికి ♦ మంగళము భారతికి
మంగళము సీతికిని ♦ మానమున కొర్కెన్
మంగళము భక్తికిని ♦ మంగళము ధాత్రికిని
మంగళము దీని విను ♦ మాన్యులకుఁ బేర్మిన్
మంగళము పాడికిని ♦ మంగళము ప్రేమకును
మంగళము మంగళము ♦ మంగళమహాశ్రీ.

క॥ శ్రీరామచంద్రు చరితము
శ్రీరామ కృపా కటాక్ష ♦ సేవధి బలిమిన్
శ్రీరామ సుకవి వర్యుఁడు
శ్రీరామార్పణముగా ర ♦ చించెను భక్తిన్.

శ్రీ శ్రీ శ్రీ



శ్రీ విక్టోరియా జూబ్లి ముద్రాక్షరశాల, చిత్తూరు, 20-7-53, కా. 1000.